# విజ్ఞాపనము.

---

ప్రౌఢజనైకవేద్యరసం బగు ప్రతాపరుద్రీయనాటకము వలెఁ గాక కోమలమతిసుగమం బగు దృశ్యప్రబంధం బొకటి అధ్యర్ధయామ మాత్ర ప్రయోజనీయము నిర్మించి యిమ్మని, నన్ను, విక్రమసింహపుర్యాంధ్రభాషాభిమానిసమాజమువారును మదరాసు విద్వన్మనోరంజనీసమాజమువారును కోరఁగా, వారి ప్రణయము నొప్పరికింపఁజాలక, నాకుం బ్రతిభయు తీఱికయు లేమికి అనుగుణంబుగా, ఈ చిన్ని రూపకమును రచియించి నాఁడను గుణదోషనిర్ణయమునకు విపులహృదయు లగువిద్వాంసులు ప్రమాణము.

వేదము - వేంకటరాయశాస్త్రి.

ది. 1, మే, 1901.

P. I. C. Quota Holder No. M.S. 114 B. (30-10-'45 1000)

శ్రీ

ఈ నా ట క ము ను

వీ ణా గా న క ళా నా ర దు లు ను

సాంగ వేదములం దధీతులును సర్వదర్శనములందు నదీష్ణులును

సంస్కృత ప్రాకృ తాంధ్ర ద్రావిడ కర్ణాట మహారా ష్ట్రాంగ్లేయ గ్రీక లాటి

నాద్యష్టాదశ భాషా లక్ష్యలక్షణాభిజ్ఞ సార్వభౌములును

ద్రావిడభాషా పైలాలజీ దర్శన ప్రథమ ప్రవర్తకులును,

మదరాస్ ప్రెసిడెన్సీకాలేజి పైలాలజీ ప్రాక్తన భాషా మహోపాధ్యాయులును,

బో ధి స త్త్వ క ల్పు లు ను

అగు

సన్మిత్రరత్నంబు

తా త వె ల్లి మి రా దా ర్

# శ్రీయుత శేషగిరిశాస్త్రులు ఎమ్. ఏ. గారి

కీర్తిమూర్తికి

స మ ర్పిం చి నాఁ డ ను.

వే. వేం.

# నాటకపాత్రములు.

---

## పురుషులు.

సూత్రధారుఁడు.
నలకూబరుఁడు.
బాణుఁడు.
కుంభాండుఁడు.—బాణునిమంత్రి.
ఆహ్లాదనుఁడు.—బాణపుత్త్రుఁడు.
గంభీరవేది.—ఉషకై బాణుఁ డుద్దేశించిన వరుఁడు.
ప్రతీహారి.
హాహా హూహూవులు.—గంధర్వులు.
అగ్ని, ఆదిత్యుఁడు, వాయువు. చంద్రుఁడు.
అనిరుద్ధుఁడు.—కథానాయకుఁడు.
విదూషకుఁడు.
కంచుకి.
పురుషుఁడు.—(కారాగృహసేవకుఁడు.)
గోపురమునాయకుఁడు. పతాకానాయకుఁడు.
శ్రీకృష్ణుఁడు.
శివజ్వరము, విష్ణుజ్వరము.
ఇంద్రుఁడు.

## స్త్రీలు.

నటి.
రాణి.—(బాణునిభార్య.)
ఉష.—బాణసుత, కథానాయిక.
చిత్రరేఖ.—కుంభాండసుత, ఉషాసఖి.
కరేణుక.—ఉషాధాత్రేయి.
మదనిక, కుముదిక.—ఉషచెలులు.
రంభ, ఊర్వశి, మేనక.
బంధరిక, కీరవాణి.—ద్వారకలో ఉద్యానపాలికలు.
రుక్మిణి.

శ్రీ

# ఉష.

ఉ. శ్రీరమ ణాత్మ చోరుని వశీకృతబాణసుతాభిసారునిన్
మారకుమారునిన్ బలిరమామహితాసురభూవిహారునిన్
గోరకధన్వికూటసుషిఁ గోపుర మెవ్వతె నిల్పి కాచె నా
శారిక పల్కుఁగాత సరసస్వరసంపద మీఁకు భద్రముల్. ౧

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు.—చాలును. అతివిస్తర మేల ? ఆర్యా,

నటి —[ప్రవేశించి] ఏమివిశేషము ఆర్యపుత్త్రా?

సూత్ర.—ఆర్యమిశ్రులు ఉషనే కనఁగోరుచున్నారు.

నటి.—ఆహాహా! మఱి వెండియు మంచికాలము వచ్చినది, ఆర్యపుత్త్రా.

సూత్ర.—నటి యీ యార్యమిశ్రులకు శ్రీవేంకటరాయశాస్త్రులవారి ప్రబంధంబుపై నింతమక్కువకుం గతం బెఱుంగుదువా ?

---

౧. పద్యము—శ్రీపతియగు నారాయణునికి మనోహరుఁడును, తన్ను బాణపుత్త్రియయిన యుష వలచి తనకై ఇల్లు వదలి ఏకాంతభూములకు వచ్చునట్లుగా చేసికొని, బలిచక్రవర్తియొక్క సంపదచేత మహనీయము లయిన పాతాళ ప్రదేశములందు విహరించినవాఁడును, అయిన ప్రద్యుమ్నపుత్త్రుని అనిరుద్ధుని ఆపాతాళమార్గ మయిన ప్రద్యుమ్నకూట మనెడి పర్వతగుహాయందు ఏశారికాదేవి గోపురము నిల్పినదియుం బోలె వెలసియుండి ఆబాణాదులవలన నుండి రక్షించినదో ఆశారికాదేవి (గోరవంక యని శ్లేష) మధుర మయిన కంఠస్వరముతో నాట్యప్రయోగమునకు సామాజికులకును కవికిని శుభములను పలుకునుగావుత.

ఆర్యమిశ్రులు=విద్వాంసులయిన పెద్దలు.

నటి.—ఎఱుఁగ కేమి ఆర్యపుత్త్రా, వక్కాణించెద వినుము.

సీ. ఛాత్త్రసాహస్రప్రచారంబుగా నాట । కములఁ దన్నిగమంబుఁ గఱపినారు,
సర్వజ్ఞ సింగమసార్వభౌమునిగద్దె । యెక్కినదొరమది కెక్కినారు,
హూణరూపకరసం బుదరంబు నిండార । ద్రావి గజ్జునఁ ద్రేఁచి తనిసినారు,
టాటోటుఁగవులు పటాపంచ లై మాయఁ । గాంచిక వాణి కర్పించినారు,
*[బల్లారిభవ కవిపండితసంఘంబు । మదరాసులో రూపుమాపినారు,]
తే. కాళిదాసశకుంతల నేలినారు,
మించినప్రతాపకృతిని నిర్మించినారు,
తగదొకో శాస్త్రిగారిగ్రంథమును గోర
మహిత వస్తు పరాయణ మానసులకు. ౧

సూత్ర.—బళి బళి! రసజ్ఞవుగదా. మఱి యిపు డీనాటకము నాడుడు మనకుం గలుఁగుకీర్తిచే మనపాత్రము లెల్ల నేమగుదురో!

నటి.—పంచదారబొమ్మ లగుదురు ; కాని, చీమలు పట్టవు లే. సరియ కాని, ఇక్కాలమున కవితాకామిని పండితులకడకు వచ్చుట లేదే, ఈమనీషి కడకుమాత్రము ఎట్లు వచ్చినదో!

---

౧ ప.—ఛాత్త్ర=శిష్య. తన్నిగమంబుఁ=ఆనాటకముల లక్షణమును. కఱపినారు=నేర్పినారు. సర్వజ్ఞసింగమనీఁడు వేంకటగిరి సంస్థానము నేలుచున్న శ్రీ శ్రీ రాజగోపాలకృష్ణ యాచేంద్ర మహారాజావారి పూర్వులలో మహనీయుఁడు, సర్వవిద్యావిశారదుఁడు. హూణరూపకరసంబు = షేక్స్పియరు లోనగువారి యింగ్లీషు నాటకములందలి రసమును. గాంచికఁ - విమర్శన గ్రంథమాలికను. మహిత...లకుఁ=పూజిత మయిన యర్థమందు ఆసక్తమైన మనస్సు గలవారికి.

*[ఈపంక్తి శాస్త్రులవారు తర్వాత చేర్చినారు.]

పంచదార—కీర్తి తెలుపుగాన దానివ్యాప్తిచేత తెల్ల నగుదురని భావము.

మనీషి=విద్వాంసుఁడు.

సూత్ర.—ఎట్లు వచ్చినదో, వచియించెద వినుము.

తే. కత మరయుదేని, తనఁతత్కృతములఁ గృతులఁ
జూచి విని మెచ్చు చతురుల సుకృత భరము ;
విధ మడుగుదేని, వలరాచవేఁదు తెగిచి
కలిమిదొరపట్టి నిదె రంభ గవసినట్లు. 3

అని నిష్క్రమింతురు

ప్రస్తావన సమాప్తము.

---

3 ప.—కవితాకామిని ఈమహీక్షికడకు వచ్చినందులకు నీవు కారణ మడిగెదవో విధ మడిగెదవో ? కారణ మే మనఁగా,—వీరి శిశువు లయిన గ్రంథములను చూచి విని సంతోషించెడి సామాజికాదులు చేసికొన్న పుణ్య రాశియే కారణము. విధ మే దనఁగా—ఇదె ఈరంభ కుబేరపుత్త్రుని నలకూబ రుని తా వలచి మన్మథోద్దీపనచే తెత్తిగొని వచ్చి కూడిన విధమే ఈయనను కవితాకామిని వచ్చి కూడినవిధము.

# శుద్ధవిష్కంభము.

స్థలము:—అలక, చైత్రరథము.

నలకూబరుఁడు ప్రవేశించును.

నల.—[ఊర్ధ్వమవలోకించుచు]

క. చల్లనివెలుఁగని యీజా
బిల్లిని డాసితిని; గందుపేరిటిపాదరే
యిల్లయి, రేలక్క మంటలు
నల్లెడునోఁకు డిది; దీనిచదురులు దెలిసెన్. ౪

హా! రంభ లేక నలకూబరుఁడు కల్ల గదా!

రంభ:—[ప్రవేశించి] కలిమిసామిపట్టి లేక రంభమాత్రము కల్ల గాదా? అది సరిగాని, ఏవి మంటలు నల్లుచున్నవి?

నల.—ఈచంద్రకరములు, నీవు లేనితఱిని, నామీఁదికి.

రంభ.—ఇవి మహోపకారులు గదా! ఇవి గదా అమరావతినుండి నన్నిటకుం ద్రోచినవి!

నల.—మఱి యీతడవేల గలిగినది?

రంభ.—'ఎట్లు గండము తప్పించుకొని వచ్చితివి?' అని యడుగుము.

నల.—వడిపడి చూఛాయగా వివరింపుము.

---

చల్లనివెలుతు రని యీ చంద్రునిఁ గూర్చి వచ్చితిని. ఇది చంద్రుఁడు గాఁడు, మఱేమనఁగా, మచ్చ యనెడు పాదఱో నివసించి మంటలు మండెడు కొఱవిదయ్యము. ఇదె దీని టక్కు. నాకు బోధపడినది.

తపోనలమునకు=తపోగ్నికి. హరనేత్రములలో = శివునికన్నులలో (శివునికి చంద్రసూర్యాగ్నులు కన్నులు గదా.) పాకశాసనుఁడు=ఇంద్రుఁడు.

రంభ.—నేఁడు దేవేంద్రుం డోలగంబుండెను. మే మాడుచుంటిమి. దిక్పాలు రెవ్వరును రాలేదు. ఏల యని యింద్రుఁడు కత మరయుచుండఁగా అత్యంతవికృత రూపు లిద్దఱు ప్రవేశించిరి. అసురు లనుకొని మహేంద్రుఁడు వజ్ర మెత్తఁగా, వారు 'నే నగ్నిని,' 'నే నాదిత్యుఁడను,' అని తెల్పుకొని శరణు వేఁడిరి. ఇంద్రుఁడు వికృతికి కారణ మడుగఁగా వారు 'బాణాసురుని తపోనలమునకు మాడి యిట్టులైతిమి, మమ్ముఁ గావవేని మే మిఁక హరనేత్రములలోఁ దాఁగి వెలుపడము.' అనిరి. అంతఁ బాకశాసనుఁడు 'మీ కాశరణమేని కలను. ఇఁక బాణుఁడు తనవేయి చేతులతోను నావేయికన్నులనుం బెఱికి వేయును, నాకు దిక్కెవ్వరు? అని గద్దియ దుమికి తల్లడిల్లఁగా, అందఱును—

నల.—[నవ్వుచు] మీ పాపడలే శరణ మని నిశ్చయించిరా ?

రంభ.—[నవ్వుచు] అవును, వా రట్లే నిశ్చయించిరి.

నల.—[నవ్వుచు] అగ్నియుం జొచ్చె నని మీరు భయపడితిరా ?

రంభ.—[నలకూబరునికి లఘుచపేట మిచ్చుచు] మేము బాణతపోగ్నికి భయపడి మావలనఁ గా దంటిమి. వారివలన నేశాపమేని భరింతు మంటిమి.

నల.—మఱి యాగండము మీ కెట్లు తప్పినది ?

రంభ.—అనుకంపమానమానసు లయిన నారదమునీంద్రులవలన.

నల.—ఎట్లు ?

రంభ.—ఆసమయమున వా రచ్చటికి విచ్చేసి సత్కృతులై కార్య మడిగి విని, ప్రణతల మమ్ముం గనికరించి బాణతపోవిఘ్నము మావలనం గా దని తెలిపి, నారాయణుఁడే శరణ మని యానతిచ్చిరి.

---

చపేటము=చెంపకాయ. అనుకంపమాన మానసులు=కనికరించుచున్న మనస్సుకలవారు ప్రణతలన్ = నమస్కరించినవార మగు. గురుపురస్సరులై = బృహస్పతి ముందు పోవువాఁడుగాఁగలవారై. కలశాంభోనిధికిన్ = పాల సముద్రమునకు.

నల.—మఱి యిపు డందఱును గురుపురస్సరులై కలశాంభోనిధికిం బోయిరా ?

రంభ.—వా రట్లే సమకట్టిరిగాని,—

నల.—మఱి యేమి ?

రంభ.—మఱి నారదులవారు వారించి యిట్లు తెరువు చెప్పిరి.—

ద్వారక నున్న వాఁ డిపుడు దానవ కాలుఁడు వాసుదేవుఁ డై;
మారుని సౌరు మెచ్చనికుమారి యుషాఖ్య వెలుంగు దాయకున్;
మీరు మురారిపౌత్త్రునికి మీ యరిపుత్త్రికి స్వాప్న సంగమున్
గూరుప రయ్య; మీయొడలు గొబ్బున వేలుపులార తీఱెడున్. ౫

ఇట్లు బోధించి నారదులవారు మా ప్రణతులు గైకొని యంతర్ధాన మైరి.

నల.—మఱి యింద్రాదులు ?

రంభ.—ఇంద్రాదులు మదనునిం దలంచిరి. అతఁడు నొయ్యారంబులు మీఱ సపరివారుఁడై యేతెంచెను.

నల.—అంతట ?

రంభ.—అంతట నగ్న్యాదిత్యపురుహూతు లాతని నిట్లుగ్గడించిరి:—

“ఓయి మనోభవుఁడా,

---

౫ ప.—అసురసంహారుఁడయిన నారాయణమూర్తి ఇప్పుడు వసుదేవ పుత్త్రుఁడుగా జనించి శ్రీకృష్ణరూపమున ద్వారకాపురములో నున్నాఁడు. మీ వైరి యగు బాణాసురునికి మన్మథుని సౌందర్యమును సయితము మెచ్చకో నట్టి కూఁతురు ఉష యనుకన్య కలదు. మీరు కృష్ణ పౌత్త్రునికి అనిరుద్ధునికిని మీ వైరికూఁతు రయిన యీ యుషకును కలలో పొందును ఘటియింపుఁడు; అందువలన మీ దుఃఖము తత్క్షణమే తీఱిపోవును.—ఆ శ్రీకృష్ణులవారే తీర్తు రనుట.

ఆదిత్య పురుహూతులు=సూర్యుఁడును దేవేంద్రుఁడును. ఉగ్గడించిరి=స్తుతించిరి

మత్త నాదుకీలలు సున్న నీయరుణప్రవాళముముందఱన్ ;
నాదువెల్గులు సున్న నీతరుణంపు మొల్లలముందఱన్ ;
నాదువజ్రము సున్న నీపికనాదభల్లముముందఱన్ ;
నీదుప్రాభవ మెట్టిదో నవనీత చోరప్రియాత్మజా!" ౬

ఇట్లు నచ్చికబుచ్చిక యిచ్చకంబుల మచ్చుఁ జల్లి కార్యముం దెలిపి, ఉషం గోడలిం జేసికొమ్మని వేఁడిరి.

నల.—ఇఁక నీవు చెప్పనేల ? ఉష తనకోడ లనఁగానే ఉప్పొంగి మాఱు పలుకక మారుఁ డంగీకరించెను.

రంభ.—అట్లే,

నల.—బాపురే ! ముందు స్వారస్య మున్నది ! అనంతరము ?

రంభ.—అట్లు బాణతపఃకాలంబున దివియందె యుండి కాయవ్యూహవిద్యాప్రభావంబున బాణగృహంబునం గొలుచుచున్న యింద్రాదులు ప్రాప్తవరుఁడై వచ్చు బాణుని యథాపూర్వ మచ్ఛలంబునం గొలువ కాయబాహుళ్యోపసంహారపరులై యసురలోకంబునఁ గరఁగిరి. ఊర్వశ్యాదులును హాహాహూహువులును వారిచే యనుగమించిరి. నేనటఁ జంద్రపాదతాడితనై యిటం బ్రాణనాయకు నొడం బడితిని.

---

౬ ప.—కీలలు=మంటలు, అరుణప్రవాళము=ఎఱ్ఱనిచిగురు. తరుణంపు మొల్లల = లేఁతమల్లెపూవుల.

వజ్రము=వజ్రాయుధము. పిక...ము=కోకిలకూఁత యనెడు బల్లెము. నవ...జా = వెన్నదొంగ యనంగు పుత్త్రుఁడా — మన్మథుఁడా అనుట — నీవు భూలోకమందు పని చేయుచున్నా వని సూచించుటయు.

కాయవ్యూహ విద్య = దేహములను అనేకములనుగా చేసికొను సాధనమయిన యోగవిద్య. అచ్ఛలంబునన్ = కపటములేక. కాయ...లై = పెక్కు దేహములను తగ్గించుకొనం గడంగినవారై. చంద్ర...నై = చంద్రకిరణములచే కొట్టఁబడినదాననై=చంద్రుఁడు కాళ్లతో తన్నఁగా బడి...

నల.—బళి బళి !

క. మంటలసోఁకైన నన్నపు
డంటి యొరియఁ జేసి, యిప్పు డమృతపువెల్లిన్
గొంటి మనుచు నీకొంటెకుఁ
దుంటవిలుతుమామ కెఱఁగుదున్ భక్తిమెయిన్ ౭

రంభ.—

క. బాణునికొలువున కలగీ
ర్వాణులు నన, మనము పంచబాణుకొలువుకై
ప్రాణేశ రమ్ము పోదము;
నాణెం బిది గాదొ యిట్లు నలుఁగుటకంటెన్ ? ౮

[అని నిష్క్రమింతురు.

శుద్ధవిష్కంభము ముగిసినది.

---

౭ ప.—తుంటవిలుతుమామకున్ = మన్మథుని మేనమామ యయిన యాచంద్రునికి. ఎఱఁగుదున్ = నమస్కారము చేసెదను.

## ప్రథమాంకము.

స్థలకము.—శోణపురి, బాణస్వాగతమంటపము.

బాణుఁడు కుంభాండుఁడును ప్రవేశించి
యథోచిత ముపవిష్టు లగుదురు.

అగ్నివాయ్వాదిత్యాదిపరివారము యథాస్థానము నిలిచి కొలుచుచుండును.

కుంభా.—అసురచక్రవర్తీ, త్రిజగతీపతీ, ఏలినవారితపఃప్రకారము విని యాశ్చర్యపడు చుంటిమి. వరములు విన్న నేమగుదురో !

బాణు.—మంత్రిసత్తమా కుంభాండా,

క. బాణుఁ డనుపేరహహా ! వి
న్నాణంబుగ నాకు నిడిరి నాతలిదండ్రుల్ ;
బాణగతి ముంజటికె యను
పోణిమి యెఱుఁగవొకో మంత్రిముఖ్యుఁడవుగదా. *

ఏరీ మనవా రందఱు ?

రాణి, ఆహ్లాదనుఁడు, ఉష చిత్రరేఖ, గంభీరవేదియుఁ,
ప్రవేశింతురు.

రాణి.—ప్రాణేశ్వరులకు ప్రణామము. [అని మ్రొక్కి] ఆర్యపుత్త్రుని శుభదర్శనముచే కృతార్థురాలను.

బాణు.—రారమ్ము, ప్రేయసీ, ఇటఁ గూర్చుండుము.

[రాణి కూర్చుండును.

ఆహ్లా.—ఆహ్లాదనుఁడను నా యనగారి పాదములకు ప్రణమిల్లుచున్నాను.

[అని ప్రణమిల్లును.

---

* ప.—విన్నాణంబు = నేర్పు. ఇడిరి = పెట్టినారు. ప్రణమిల్లును = మ్రొక్కును.

బాణు.—రా వోయి, నాయనా, రా కూర్చుండుము.

[అహ్లాదనుఁడు కూర్చుండును.

ఉష.—నాయనగారిపాదములకు ఉష ప్రణమిల్లుచున్నది.

[అని యట్లు చేయును.

బాణు.—రా, అమ్మా, రా. [అని దగ్గఱ కూర్చుండఁ బెట్టుకొనును.

చిత్ర.—మామగారిపాదములకు చిత్రరేఖను మ్రొక్కుచున్నాను.

[అని మ్రొక్కును.

బాణు.—కల్యాణము, కల్యాణము, కూర్చుండుము, నీచెలికడనే.

[చిత్రరేఖ ఉషకడం గూర్చుండును.

గంభీ.—మామగారిపాదములకు గంభీరవేదిని మ్రొక్కుచున్నాను.

[అని యట్లు చేయును.

బాణు.—కల్యాణము కల్యాణము, కూర్చుండుము.

[గంభీరవేది కూర్చుండును.

బాణు.—మంత్రిపుంగవా, మనవా రందఱు క్షేమమా !

కుంభా.—ఏలినవారిప్రతాపము కాచుచుండ క్షేమము గా కేమి ?

బాణు.—దేవతలు మిమ్ము చక్కఁగా కొలుచుచున్నారా ?

కుంభా.—కొలుచుచున్నారు ; అనుకంపనీయులు.

బాణు.—ఊఁ. [ఆహ్లాదనుం గూర్చి] వత్సా, నీవు మాతపఃకాల మెల్ల నేమి సేయుచుంటివి ?

ఆహ్లా.—గురువర్యులను శ్రీమచ్ఛుక్రాచార్యులను శుశ్రూషించుచుంటిని.

కుంభా.—దానవేంద్రా,

ప్రోదిగా బాలుఁ డితండు భార్గవుని శుశ్రూషించి, వేదంబులున్
వేదాంగంబులుఁ బంచలక్షణపురావృత్తంబులున్ నేర్చి, యా

హ్లాదం బొజ్జకుఁ జేసి, సార్థితనిజాహ్లాదాఖ్యుఁ డై, 'వత్స ప్ర-
హ్లాదానూనుఁడ వౌదు' వంచు వరముం బ్రాపించెఁ దద్వాక్కునన్.

బాణు.—వంశమునకుఁ గీర్తి దెచ్చితివి వత్సా.

ఆహ్లా.—మహానుగ్రహము, మహానుగ్రహము.

ప్రతీహారి—[ప్రవేశించి] జయము జయము జగదీశ్వరులకు. స్వర్వేశ్యలు మేళమై నాట్యసేవార్థము వచ్చియున్నారు.

కుంభా.—దానవనాథ, మంగళార్థము వారికి సెలవు సెల వొసంగవలయును.

బాణు.—మంచిది.

[ప్రతీహారి వెలువడి రంభాదులను దోడ్కొనివచ్చి విడిచిపోవును. రంభాదులు బాణునికి మ్రొక్కి నిలుతురు.

బాణు.—ఎవ రెవరే మీరు ?

రంభ.— (కాంసరుతకము)

సామి, నీదాసి నేఁ, జాటుదురు రంభ యని లోకముల నన్ను నసురేంద్రా,

ఊర్వశి—

సామి, నీదాసి నే, స్వాశ్రిత నూర్వశిని, సల్పుదును లాస్య మసురేంద్రా.

మేనక—

సామి, నీదాసి నే, సంస్తుతను, మేనకను, స్వాంతజుఁడు మెచ్చు నను దేవా.

---

౧౦ ప.—శౌరికిన్ = చక్రికిఁగా. భార్గవునిన్ = శుక్రాచార్యుని. పంచలక్షణ పురావృత్తంబులన్ = పురాణేతిహాసములను. ఒజ్జకున్ = గురువునకు. సార్థి...డై = ఆహ్లాదనుఁ డనెడి తన పేరిని సార్థకము చేసి. అనూనుఁడవు = తక్కువ కానివాఁడవు.

హాహాహూహువులు.—

సామి, సంగీతిలో సత్ప్రీతి మొకింతపని, సాకతము వేఁడెదము దేవా. ౧౧

బాణు.—అడుదురుగాని. ఓరి అగ్నీ, ఈకుంభాండాదులు విన మాతపస్సును వర్ణింపుము. [నిర్వర్ణించి] ఏమిరా నీ విట్లు బొగ్గవలె నల్లఁబడినాఁడవు?

అగ్ని.—[హుక్కాగొట్టము నజరు చూపుచు కేలఁబూని]

బాసనములోన నెపుడున్, నానినవే వైచినారు నాకుం గట్టెల్,
దానం గడుఁ బొగచూరుడు, నే నల్లగ బొగ్గ నైతి నిర్జరభీమా.

బాణు.—ఏమిరా, వాయూ, నీ వేల ప్రొయ్యి యూఁదకుంటివి?

[అని వాయువును కొట్ట నుంకించుచున్నాఁడు.

వాయువు.—[అమితముగా వణఁకుచు నెమలిపురివిసనకఱ్ఱ వీచుచు ఆత్మగతము] అహా! నేను కోరిన ప్రశ్నయే వచ్చినది! ధౌర్త్యము చేసెదఁ గాక. [ప్రకాశము] లోకనాయకా,

ఆ. ఊదియూఁది బుగ్గ లోపిరిబూరెలై,
బుంగలై, మఱంత బూరటింపఁ
బెద్దసిద్దెలట్లు పెరిఁగి చీలినవయ్య,
కుట్టుకొంటి నయ్య కొట్టకయ్య. ౧౩

బాణు.—[నిర్వర్ణించి తల యూఁచి] మంచిది; చక్కఁగా వీవుము. మఱి, వాఁ డెక్కడరా మీతలమాసిసి వేగంటివిసాసి?

వాయు.—బురుజుమీఁద కోవుర మున్నాఁడు దేవరా.

---

౧౧ ప.—శ్రౌతములన్=శ్రౌతకర్మలయందు. స్వర్వనితన్=స్వర్గస్త్రీని. లాస్యమునల్పుదును = ఆటలో నేర్పరిని. సంశ్రుతను = ప్రఖ్యాతి కలదానను. స్వాంతజుఁడు=మన్మథుఁడు. సాకతము=అనుగ్రహము.

౧౨ ప.—బాసనము=వంటయిల్లు. నిర్జరభీమా=దేవతలకు భయంకరుఁడా. ధౌర్త్యము=కపటము.

బాణు.—ఊఁ. ఓరీ, ఆదిత్యా, నీ వేలరా కట్టియ లెండింపవు?

ఆదిత్యుఁడు.—[పుండరీకము నజరు వెట్టుచు] మహాప్రభూ,

క. లేయెండయె యెవ్వేళను
గాయుచు నుండును మని నీదుకట్టడయ కదా;
పాయక నే నటు సేయుటఁ
బాయదు కట్టియలతేమ భండనభీమా. ౧౪

బాణు.—మఱి, వాఁ డెక్కడ నీసైదోడు?

ఆ.—వాఁ డెక్కడనో ఎఱుంగను, దేవా.

బాణు.—[కినుకతో] ఏమి కారణము?

ఆది.—మహాప్రభూ, మన్నింపవలయును.

ఆ. నిండు పున్నమగనె పండువెన్నెల సదా
కాయ నతని కిడినకట్టుఁబాటు;
దాన నతఁడు నేను దాయుటయే లేదు;
నీపదంబు లాన, నిక్క మిదియ. ౧౫

వాయు.—మహారాజ, నే నెఱుంగుదును. ఏలినవారికి తపస్తాపశాంతికై ఇదె యిటనె తన శీతకిరణంబుల తెల్లని చలువజల్లిం గట్టుచున్నాఁడు. [పరికించి] వాఁడె వచ్చుచున్నాఁడు.

---

౧౪ ప.—లేయెండ = నీరెండ. కట్టడయ = ఆజ్ఞయే. భండనభీమా = యుద్ధములో భయంకరుఁడా.

సైదోడు=చెలికాఁడు—చంద్రుఁ డనుట.

౧౫ ప.—దాయుటయే లేదు.—సూర్యచంద్రులు కలసిన నాఁడు అమావాస్య. వారు నిండుదూరమున నున్న నాఁడు పూర్ణిమ. నిక్కము = సత్యము. జల్లిక=వీచోపుచు, సభాస్తారులు=సభవారు.

బాణు.—[స్మితముతో] జడాత్ముఁడు, వానికేదియు ముందుగాఁ దోఁపదు. [చంద్రుఁడు ప్రవేశించి కలువ సజరుంచి నమస్కరించి జల్లి వీచుచుండును.

బాణు.—[వీక్షించి] ఊ. ఓరీ, అగ్న్యాదిత్యులారా, మాతపస్సును చెప్పుఁడు. మీ రేగదా సాక్షులరు.

ఇరువురు.—అట్లను మహాప్రభూ.

అగ్ని.—ఓహో సభాస్తారు లెల్లరు నాలింపుఁడు:—

స్కంధగ్రంథులు వ్రస్సి వాయువులు నిర్ఘాతధ్వనిన్ మ్రోఁగఁగా,
సింధువ్రాతము క్రాఁగ నీశ్వరజటాసింధ్వంభముల్ తెర్లఁగా,
బంధం బేసి సుమేరుమందరగిరి ప్రాగ్భారముల్ ద్రొర్లఁగా,
సంధాబంధురబాణదానవతపఃస్ఫారాగ్ని పర్వెన్ దివిన్. ౧౬

బాణు.—ఆహాహాహా!

అందఱును.—ఆహాహాహా!

హాహాహుఁడు.—ఏమియాజ్ఞ మహాప్రభూ?

బాణు.—నిన్నెవరురా పిలిచినారు?

కుంభా.—త్రిలోకనాయకా, వీఁడు హాహాగంధర్వుఁడు, తపోవర్ణన శ్రవణపరవశుఁడై, తమరు ఆహాహా యని సాధువాదము పలుకఁగా తన్నుఁ బేర్కొన్నట్లు భ్రమఁజెందినాఁడు.

---

౧౬ వ.—ప్రతిజ్ఞను దృఢముగా నిర్వహించువాఁడైన బాణాసురుని తపస్సుయొక్క మహాగ్ని ఆకాశమందు వ్యాపింపఁగా, ఒకదానిపై నొకటి గోడకీటులవలె పేఁటియున్న గాలికీటులు ఎడఁబాసి పిడుగుమ్రోఁతతో చీల సాగినవి, సముద్రముల సమూహము ఉడుకెక్కినది, శివుని జడలలోని యాకాశగంగయొక్క నీళ్లు తెర్లుచుండినవి, పాదుచెడి మేరుమందర పర్వతముల శిఖరములు ఊడి ద్రొర్లిపడినవి.

సాధు వాదము=మెప్పుం జెప్పుట.

బాణు.—[బిగ్గరగా నవ్వుచు] ఓరి నిర్భాగ్యుఁడా, హూహూహూహూ!
[అని బిగ్గరగా నవ్వును.

హూహువు.—విశ్వనాయక, ఏమి యాజ్ఞ?

బాణు.—[నవ్వుచు] వీనిపేరు హూహూవా?

కుంభా.—అవును దేవా.

బాణు.—భ్రాంతులు నిర్భాగ్యులు! హేహేహే! [అని నవ్వి] హేహేగంధర్వుఁడు నొకఁ డిటఁ గలఁడా? హోహోహో! [అని నవ్వును.

ఆది.—ఓహో సభాసదులారా, వినుండు:—

వైకుంఠుం డలచక్రవాళ మనునావంబం దజాండాము భాం
డైకవ్రాతము పేర్చి భవ్యపరిపాకార్థంబుగా నూఁకఁగా
నాకాశంబు ఘటించి ద్వాదశసహస్రాంశ్వగ్నులం జొన్ప నం
దీకల్యాణుతపంబు గ్రచ్చుఫల మయ్యెన్ సర్వభంగంబుగా. ౧౭

బాణు.—వహావ్వా వహావ్వా! చూచితివా కుంభాండా! అయినను ఈతామదేవతలు! చక్కఁగా వర్ణింపలేరు. మఱి నేనే వర్ణించెదను విను. మా తపస్సునకు నొకవింత, ఏమనఁగా.—

---

౧౭ ప.—నారాయణమూర్తి (యనెడు కుమ్మరి) చక్రవాళపర్వత మనెడి యావములో బ్రహ్మాండము లనెడు కుండలయొక్క సమూహమును పెట్టి చక్కఁగా కాలుటకై (క్షేమకర మయిన పరిణామముం బొందునట్లుగా) ఆకాశ మనియెడి యంముకను త్రక్కి పన్నిద్దఱు సూర్యు లనెడి నిప్పును పెట్టఁగా, ఆయావములో ఈ కల్యాణమూర్తియొక్క అనఁగా బాణాసురుని యొక్క తపస్సు గ్రచ్చుకాయగా ప్రవేశించినది.—ఆవములో గ్రచ్చుకాయ పడిన యెడల ఆవములోని కుండ లన్నియు పగిలిపోవును. అట్లే నారాయణ మూర్తి కాచుచున్న బ్రహ్మాండముల కన్నిటికిని బాణాసురుని తపస్సువలన అపాయము కలిగినది.—విష్ణువుయొక్క కార్యమునకు భంగము కలిగినదనుట.

అలరించెన్ నగనన్దనామక తపోహవ్యాశన వ్యాప్తి నౌ
దలయే ఉప్పొంగుకంగఁ, బైకుబికె మీఁదన్ దాఁబేళ్ళొమ్రెపళ్ళెల్లవ్వరై
యలమన్ డాసగ మాహిమాద్రిజఁ, దదాయాసంబు త్రోపాడ, వే
యలయుగ్రుండటువచ్చి కోరువరమం చార్తిన్ ననున్ వేఁడుటల్.

ఇంకను వినుఁడు.—మాతపోగ్నినుండి.—

ఒకమిడుంగుఱున నాజ్యోదధి కాఁగి యూ। కమఠకిటుల్ కూడు గాఁగనుండ,
ఒకమిడుంగుఱున మేరుకుభృత్తు కరఁగి యా। నిప్పుటేట జగంబు నీర్గనుండ,
ఒకమిడుంగుఱున శంభుకపర్ద మెరిసి యా। కమరువాసన దెసల్ గడవనుండ,
ఒకమిడుంగుఱునఁ దారకకోట్లు మండి యా। కచ్చికశిల యెల్లఁ గప్పనుండ,
బ్రహ్మవిష్ణ్వాదు లెల్ల నీప్రళయ మాఁపు,
మనుచుఁ దనవెంట రా, సాంబుఁ డారటమున
వచ్చి, 'కోరుము కోరుము, వరము వరము,
బాణ బాణ,' యనువిభూతి పరఁగె చాడు. ౧౯

---

౧౮ ప.—నా తపోవహ్ని వ్యాపించినందున శివుని శిరము మీఁది గంగ మిక్కిలి యుడుకెక్కి సాగినది. అంత నందులోనివి చేఁపలు తాఁబేళ్లు మొసళ్లును ఆ వేఁడినీళ్లలో నిలువలేక చలువకోసము, మంచుకొండ కూఁతురుగాన చలువగానుండు నని పార్వతియొక్క దేహముమీఁదికి ఉఱికి ఆవరించినవి. ఆమె శివుని దేహములో ఎడమ సగభాగముగదా. ఆజలజంతువుల తాఁకుడు సహింపలేక ఆమెపైన యూసగము దేహము నింజుకొనఁగా కడమ సగమయిన శివుఁడు ఆ యాయాసమునకు నిలువలేక వేగముగా ఆతీరుననే వచ్చి నన్ను 'ఓరీ బాణా, బాణా, వర మడుగురా అడుగురా.' అని దీనముగా బతిమాలుకొనఁగా, నాకు నవ్వు వచ్చినది.

౧౯ ప.—మిడుంగుఱునన్ = నిప్పురవచేత. ఆజ్యోదధి = నేతిసముద్రము. కమఠకిటుల్ = ఆదికూర్మము ఆది వరాహమును. కుభృత్తు=పర్వతము.

కుంభాండాదులు.—శబాస్! శబాస్!

కుంభా.—వీరినవారివరములు వినం జెవులు దురదగొనుచున్నవి.

బాణు.—మహేశ్వరుఁ డెట్లు ప్రత్యక్షమై నా కిచ్చిన వరములు వినుము.

క. చండికతో వాసం బై,
ఖండేందుశిఖుండు నాదుగవనుం గాచున్;
జెండా పడుతఱి మద్ధ్వజ
కండూతి తెమల్చునీమకదనం బొసఁగున్. ౨౦

అందఱును.—ఆహా! ఈశ్వరానుగ్రహము! అహో తపో మహిమ!

బాణు.—సరియ యేటోయి సూర్యాగ్నులారా?

సూర్యాగ్నులు.—ఔను మహాప్రభూ, మే మప్పుడు తపస్సునకు నిలువలేక హరనేత్రములందు డాఁగి చూచు చుంటిమి.

బాణు.—వహవ్వా! [రంభాదుల నుద్దేశించి] మఱి మీయాటపాటలు కానిండు.

రంభాదులు.—[ఆడుచు]

(గేయము)

నిన్నుఁ బొగడఁ దరమే!
బలిరాజసుత! నిన్నుఁ బొగడఁ దరమే!

---

కపర్దము = జటాజూటము. ఎఱసి = కాలి. తారక = నక్షత్ర. ఇల = నేల. సాంబుఁడు=శివుఁడు.

౨౦ ప.—ఖండేందుశిఖుండు = చంద్రకళాశేఖరుఁడు - శివుఁడు. గవనున్ = పురద్వారమును. కండూతి=దురద. కదనంబు = యుద్ధమును.

గేయ—అరహరి=నరసింహుని (నరసింహస్వామి) యొక్క. ముత్తాత =ప్రహ్లాదుఁడు. అయ్య=తండ్రి - బలిచక్రవర్తి. గిరిశునిన్ = శివుని. పోరు= యుద్ధమును. కావలుఁడు = ద్వారపాలుఁడు.

అరహరికోపము నడఁచె నీముత్రాత,
హరిని భిక్షునిఁ జేసె నయ్య,
గిరిశుని గడపకాపరిని జేసితి వీవు,
వశము పో రడుగుకావలుఁడు మ ఱెవ్వఁడు! నిన్నుఁ॥
వేకన్ను లున్న నేవెంట బెదరవచ్చు;
వేకాళ్లు వలసకు వెరవు;
వేకేళ్లు గల్గిన వేవే ట్లోసఁగవచ్చు;
నీకెవ్వఁ డీరేడు లోకములను నీడు! నిన్నుఁ॥
కలనఁ గాలాశ్వశృంగములు నీమీసము;
చెలులకు ముదిరధన్వలత;
వెలఁదుల కాయించువిల్లు నీమీసము;
ఇలలోన నీసాటి బలియుఁ డిం కెవ్వఁడు! నిన్నుఁ॥

బాణు.—మీకు గృహసమ్మార్జనాదిక్లేశమునకు బదులు ఇఁకమీఁద సంగీతవ్యాపారముననయుండ ననుజ్ఞ యిచ్చితిమి. చాలునా యీబహుమానము ?

రంభాదులు.—[పడపడ వణఁకుచు] మహాప్రసాదము.

బాణు.—[ఉషం దఱియం దిచిచి, చేయి పట్టుకొని,] అమ్మా, ఎంత

---

వేకన్నులు ఇంద్రునికిఁ గలవు. వేకాళ్లు సూర్యునికిఁ గలవు. వలసకున్ =పరారియగుటకు. కేళ్లు = చేతులు. ఈరేడు = పదునాలుగు.

కలనన్ = యుద్ధములో. కాల...ములు = యముని గుఱ్ఱము (అగు దున్నపోతు) యొక్క కొమ్ములు. కలన...లు = ఆమీసమును చూడఁగానే శత్రువులు గుండె బ్రద్దలై చత్తురనుట. ముదిరధన్వలత = ఇంద్రధనుస్సు. చెలుల...లత—సువృష్టి సూచక మయిన యింద్రధనుస్సువలె సంతోషపెట్టు ననిభావము. వెలఁదులకున్ =స్త్రీలకు, ఇంచువిల్లు= (మన్మథుని) చెఱకువిల్లు—మరులు గొల్పు నని భా.

సమ్మార్జనాది = ఊడ్చుట లోనగు.

సుందరాంగునిం జెప్పినను రూపహీనుఁ డందువు. ఇప్పటికేని తెలివి కలిగినదా? ఇఁక నైనఁ బెండ్లి చేసికొందువా అమ్మా.

[ఉష మెల్ల మెల్లన తండ్రి చేయి విడిపించుకొని నిష్క్రమించును, చిత్రరేఖ ఉష ననుగమించును. గంభీరవేది ఉషను గంటికగపడునంతవఱకు వీక్షించి తర్వాత ఉస్సు రనును. ఆహ్లాదనుఁడు చిత్రరేఖ పోకం గని తల వాంచి చింతిల్లును.

బాణు.—హా! ఏమి దీనిస్వాతంత్ర్యము! ఓయి గంభీరవేదీ, చింతిల్లకుము. నేను బోధించి ఉషను ఒప్పించి నీకు వివాహము చేసి మాయక్కను సంతోషపెట్టెదను లే.

గంభీ.—మామగారియనుగ్రహము.

[చిలుకలును గోయిలలును స్వాగతమంటపము చెంత మెండుగాఁ గూయును. తుమ్మెదలుఁ ఝంకరము ఝుంకరించును. మంటపమున మలయమారుతము వీచును. పుష్పముల పరిమళము వ్యాపించును.

బాణు.—ఏమి యిది! ఋతువు వచ్చియున్నను, ఋతుధర్మము లెల్ల నిట్లెప్పు డీచట యౌగపద్యంబునం బ్రకట మగుట వింతగా నున్నవి?

కుంభాండాగ్నిసూర్యాదులు.—చేతనాచేతనములెల్ల ఏలినవారి యభ్యుదయము నభినందించుచున్నవి.

కుంభా.—కుమార, మీనాయనగారు సంతసిల్ల నీవిద్యాప్రభావమును వసంతవర్ణనం జూపుము.

ఆహ్లా.—నాదియు నొకవిద్యయా! అయినను పెద్దలమాట నతిక్రమింపఁజాల.

సరవిన్ వేఁడికి డస్సి, శీతలజలస్నానంబుగా, నిర్మలాం
బరపాళిం దడియాఱి, మంచుఁజెమరుల్, మాఘ్యానిలంబార్పఁగా,

---

ఋతువు = వసంతర్తువు. యౌగపద్యమునన్ = ఏకకాలమున. అభ్యుదయమును = గొప్ప మేలును.

బురుసాపట్టుజరీబుటాపరికిణీము స్త్రీబుతో స్వాదరా
బురఖాతోడ జవాహరీపటలితో భూకాంత గూడెఁ గామధుఁగ్ ౨౧

బాణాదులు.—బళిబళి ! వహవ్వా !

అహ్ల.—మఱియు నిపుడు.

అతిశయకౌతుకంబు వొలయంగ, నశోకలతావధూటి యీ
దక్షిణగంధవాహు బలితంపుఁగవుంగిటఁ గ్రుచ్చి, వే సమ
స్తక్షితిజాత లాలతలతావుల కల్గి, మరందవారి పు
ష్పాక్షులఁ జిప్పిలఁగ్ గిసలయాధర మీయక త్రిప్పఁ జూడరే. ౨౨

బాణాదులు.—బళిబళి ! శబాస్.

బాణు.—అట్లేని నగరి కేఁగి యుద్యానంబున వసంతశోభం దిలకింతము.

[బాణరాజ్ఞీ సుతకుంభాండులు నిష్క్రమింతురు.

[నేపథ్యమందు]

ప్రేయసీ, ఈరాత్రియే మనకనయునికి స్వప్నమున గాంధర్వ వివాహము నిర్వర్తింపుదము.

---

౨౧ ప.—భూమి యనెడినాయిక వరుసగా వేడికి బడలి (గ్రీష్మ ధర్మము), చన్నీళ్ల స్నానమాడి (వర్షర్తుధర్మము), తెల్లనివలిపములతో తడి యార్చుకొని (నిర్మలమయిన యాకాశములో జలము తగ్గిపోఁగా—శరద్ధర్మము) నునుమంచువంటి చిఱుఁజెమరును (హేమంతధర్మము) మల్లెలమీఁది గాలి తీర్పఁగా (శిశిరర్తుధర్మము), సరిగబుటాలు గల బురుసాపట్టు పావడ ధరించి (నానావిధము లయిన పువ్వులతోడి చిగురాకు లంతటంగలిగి), సర్వము బంగారు జల్తారుగు మేల్ముసుఁగు దాలిచి (బంగారుధూళివంటి పుప్పొడి పైపై నంతటను వ్యాపించుచుండఁగా), మెండుగా నగలు (చిత్రవర్ణముల పూవులు పిందెలు పక్షులును) గలిగి, వసంతుఁ డను నాయకునిం గలసెను.

౨౨ ప.—మితిలేని తమకము ఉప్పొంగఁగా, అశోకశాఖ యనెడి జవరాలు పరిమళములు వెదచల్లుచున్న యీదక్షిణపు వాయుదేవుని (చంద

ఆది.—[జనాంతికము, అగ్నిమిత్రునితో] మదనభాషితమును వింటిరి గదా. మనకు మంచికాలము వచ్చుచున్నది.

[దేవతలు నిష్క్రమింతురు. గంభీరవేది మెల్లఁగా ప్రయాసతో వెడలును.

కరేణుక.—[వెనుకనుండి ప్రవేశించి గంభీరవేదిచేయి పట్టుకొని నిలిచి] ఉష పోతూ వున్నప్పుడు ఎందుకు ఉస్సురన్నావు? చెప్పు.

గంభీ.—కరేణుకా, ఆ దంతా, మామను మెచ్చినకష్టం; నామాట నమ్ము. నాకు ఉషా అక్కర్లేదు, గిషా అక్కర్లేదు. నీమీద తప్ప నామనసు ఇంకెక్కడా లేదు.

కరేణు.—అయితే మరిరా యిప్పుడే పెళ్లి శోభనం అన్నీ కానీ.

గంభీ.—నీపుణ్యం, ఇక్కడ మాట్లాడకు, నాతో అవతలికి రా చెప్తాను.

[అని నిష్క్రమింతురు.

ప్రథమాంకము ముగిసినది.



---

నాది చర్చలు దాల్చి గ్రహించుచును వచ్చిన దక్షిణనాయకుని) బిగువుగా ఆలింగనము చేసి, అంతట తటాలున ఎల్లతావులందును మొలచిన తీఁగల పరిమళములు ఆతనిదేహమం దున్నందున (నానాప్రదేశములలోను సందుగొందులలోను నుండు నాయికల పరిమళములు అతని దేహమందు ఉన్నందున) ఆతనిపై ఈసువహించి, మకరంద మనెడు బాష్పములు, పువ్వులనెడి కన్నులనుండి కాలుచుండఁగా, అతనికి ముద్దుగొనుటకై తనచిగురా కనియెడి పెదవిని ఇయ్యక ఇటునటు త్రిప్పుకొనుచున్నది చూడుఁడు.—మలయమారుతము నానాజాతి పుష్పపరిమళములతో వచ్చి అశోకశాఖలో వీచి అందలి పూవులనుండి మకరందమును క్రిందికి జార్చి దాని చిగురుటాకులను ఆడించుచున్నదని భా.

# ద్వితీయాంకము.

స్థలకము:—శోణపురి, ఉషాప్రమదవనము.

ఉష, సఖియుగళము, చిత్రలేఖయు, ప్రవేశింతురు.

[ఉష తామరసెజ్జపై మూర్ఛితయై యుండును.
సఖు లిరువురు తామరాకులతో వీచుచుందురు.

చిత్ర.—[ఉషను కేలఁ దడవి నిర్వర్ణించి, ఆత్మగతము] ఇది కామజ్వర మని నేను మొన్ననే శంకించితిని.

ఆ. లలన డీలుపడియు లావణ్యమున మించె
నలుపుటెక్కు చందుకలయుఁబోలె ;
ఇట్లు జవ్వనులకు హితశత్రు వౌకూళ
మధుని వేఁడి యగునె మరుఁడు గాని. ౨౩

నేను క్షణము ఉషతో నొంటిపాటున నుండి గుట్టు తెలిసికొనియెదను. [ప్రకాశము] చెలీ మదనికా, చెలీ కుముదికా, ఈవాసంతాతపము సఖికి దుస్సహమైనది, తామరసెజ్జలకు శమిల్లినది గాదు. అల్లయ్యాయవ్వలిబాలచందనషండమునకుం బోయి చెలికై గంధపుఁబాలు కొని రండు.

చెలులు.—నీవు వచ్చిన సంకరయుం జక్కఁబడు నని మేము ముందే అనుకొంటిమి. [అని నిష్క్రమించిరి. ఉష లేచును.

చిత్ర.—ఉషా!

---

ప్రమదవనము = ఆటతోఁట. సెజ్జ=శయ్య.

౨౩ ప.—ఈజవరాలు కృశించియుం కృష్ణపక్ష చంద్రరేఖవలె కాంతి హెచ్చియున్నది. ఈవిధముగా యువతులను నశ్మి హెచ్చించుచునే క్లేశపెట్టెడు క్రూరుఁడు మన్మథుఁడుగాని వసంతపు టెండవేఁడిమి గాదు.

షండము=గుబురు.

ఉష.—[అనాకర్ణితకముగా] నాసఖు లెక్కడ? హా! మూర్ఛిల్లితిఁ గావలయుం. ఆహా! మూర్ఛయే యుపకారిణి యైనది. చిత్రరేఖను దేర సఖులు చనియుందురు.

ఆ. చిత్ర మేమొ నేను జిత్రరేఖను జూడ
నిపుడు కోరినట్టు లెపుడుఁ గోర;
తాపదీన మైనతఱి డెంద మాప్తులఁ
బెల్లు దలఁచు ననుట తెల్ల మయ్యె. ౨౮

చిత్ర.—ఓహో! చెలి నన్నుం గనలేదు. ఇది మఱియుం ననుకూలము. నేను డాఁగి యీమెవృత్తముం బరికించి రహస్య మెఱింగెద.

[అని యట్లు చేయును.

ఉష.—ప్రాణేశ్వరా, నిన్ను వెండియు నేఁ గాంతునో!

చిత్ర.—ఆహా! 'ప్రాణేశ్వరా' యనుచున్నది! నాతలంపే నిజమైనది. వృత్త మి ట్లుండ శీతలోపచారముల నేమి ప్రయోజనము?

క. ముందునిదాఘముచేఁ గల
గుందై నసిచెడినబండిగురివెందలతఁ
వెండియు విలసిలఁజేయఁగఁ,
బంశితుఁ డామనియ గాక పన్నిర్గునే! ౨౯

మఱి యెవ రాధన్యుఁడు?

ఉష.—ఇఁక నేను ఈవిరాళికి దేహమును ధరింపఁజాలను.

చిత్ర.—ఆహా! ఎంతబలీయమైనయనురాగము.

---

౨౮ ప.—తా.—తాపముచే దిగులుపడి యున్నప్పుడు హృదయము ఆప్తులను చూడ మిక్కిలి కోరు నన్నమాట స్పష్ట మగుచున్నది.

౨౯ ప.—నిదాఘము=వేసవి. ఆమనియు=వసంతుఁడే.

ఉష.—ఛీఛీ! ఏల కలిగినది యీపాడులజ్జ! నారెండవ మేనికి చిత్రరేఖకు అపరాధ మొనర్చితిని.

చిత్ర.—ఏమి యపరాధము? ఎట్లు?

ఉష.—హా! చిత్రరేఖకుఁ జెప్పక నారహస్యమును దాఁచితిని.

చిత్ర.—ఆహాహా! ఏమి నామీఁదికూరిమి!

ఉష.—చిత్రం దలఁచిన ప్రత్యాశకలుగును. చెలి యిట్టి యుపాయశాలిని.

తే. చెలియ నాదుగుట్టు తెలియు నం చలికితిఁ,
దెలియదాయె నేమి తెన్ను నాకు!
తల్లి నేమఱించి వెళ్లి తోఁడెటిఁ గాంచి
తల్లిఁ బనవు లేడిపిల్ల నైతి. ౨౬

అట్లు కాదు, ఆశ నన్ను వెక్కిరించుచున్నది. స్వప్నవిహారవిషయమున చిత్ర యేసియుం జేమి సేయఁగలదు.

చిత్ర.—ఏమి యద్భుతము! ఏమి యద్భుతము! స్వప్నమునం బ్రాణేశ్వరునితో విహరించినది నాప్రియసఖి. అధన్యునికై యీవిరాళి.

ఉష.—సఖి నాకడ కేల రాదు నేఁడు! నానేరమి దిద్దుకొని క్షమ వేఁడి జీవితము సవంగవ్యాధుని కిచ్చి శాంతిం బొందెద.

చిత్ర.—ఈ మెపలుకులలోనే అతఁ డెవరో తెలియునో చూచెద.

ఉష.—చెలి వచ్చునంతలో నాశిశువులం గని యామంత్రించెద.

[అని ఆయాలతావృక్షముల నుద్దేశించి]

కురవక పుత్త్రకా, తిలక కూరిమితమ్ముఁడ, మ్మావి యల్లుఁడా,
యరిదిగఁ బుష్ప మొంది సొబగారెడుచంపకవల్లి పుత్త్రికా,

---

ప్రత్యాశ=ఆశ తీఱు నను నమ్మకము.

౨౬ ప.—అలికితిన్=భయపడితిని. పనవు=ఏడ్చునట్టి.

విరాళి=వియోగదుఃఖము. ఆమంత్రించెదన్=సెలవుగొనియెద.

తరలెద మిమ్ము వీడి యొకతావునకున్, సరి యింతతోన మి [౨౭
మ్మురమునఁ జేర్చి కాంచి కయినొత్తిడి మోమున రాగమూనుటల్

[అని ఆయాతరులతలను యథోక్తముగా సంభావించి నల్గడ లరసి] ఆహా! నా కంటి కే మగపడుచున్నది!

ఎక్కలితేఁటిబొగ్గుగమి సీతలిరుంగుమికొల్మినిప్పుపైఁ
జక్కఁగఁ జేర్చి మారునికిఁ జైత్రుఁడు దక్షిణవాయు వూఁదఁగా,
నుక్కుటశోకకోరకశరోత్కర మెఱ్ఱఁగఁ గాల్చు; నయ్యయో!
యిక్కడ నిల్వఁజాల; నిఁక నెక్కడి కేఁగుదు నేమి సేయుదున్!

అయినను ఎటకేనియుం బోయెద. [అని పరిక్రమించి] హా! ఈతావు దానికన్న దుస్సహముగా నున్నది!

కొరడాప్రేటులు గాఁగఁ బైపయికి జోగున్ వల్లికాకోటి; బం
భరసేనల్ గయిగాళ్లసంకెలలుగా బాటిల్లెదున్; మాకరం

---

౨౭ ప.—కురవక = ఓ గోరంటా. తిలక=ఓ బొట్టుగుఁ జెట్టా. మావి= మామిడీ. పువ్వు మొఁది=పువ్వులు పూచి (రజస్వలవై) సొబగు అరెదు=అందములుగులుకుచున్న. కయిన్ ఒత్తు ఇడి = చేతితో ఒత్తి (మీ చేతులకు ఒత్తులనెడి యాభరణములను బెట్టి). ప్రమదలు ఉరమునఁ జేర్చుట, చూచుట, చేతితో తాఁకుట. ముఖరాగము చూపుటయు వరుసగా కురవక తిలక సహకార చంపకములకు పూత గలిగించెడి దోహదములు.

౨౮ ప.—ఈచోట వసంతుఁడు అను కమ్మరి ఈ చిగుళ్లనెడి కొలిమి నిప్పుమీఁద తుమ్మెద గుంపు లనెడి బొగ్గు మొత్తములను పెట్టి, దక్షిణపుగాలి యనెడి తిత్తిగాఁడు తిత్తి యూఁదుచుండఁగా, అశోకపు మొగ్గ లనెడి యినుప బాణములను ఎఱ్ఱఁగా కాల్చి మదనునికి ఇచ్చుచున్నాఁడు! కావున ఇచ్చోట నే నుండలేను! మఱియెక్కడికి పోదును? ఏమి చేయుదును?

దరసాసారవితప్తలోహమయదండవ్రాతసంప్రోతపం [౨౯
జరమయ్యెన్ బువ్వుఁదోఁట;నాకిచట నేజాడన్ శుభం బయ్యెడున్!

చిత్ర.—సత్యము, చెలిమీఁద నిట దురమే విరచిత మగుచున్నది!

వాయవ్యాస్త్రము దక్షిణానిలము, భాస్వత్పల్లవవ్రాత మా
గ్నేయాస్త్రంబుఁ, బ్రఫుల్లకాంచనసుమానీకంబు బ్రహ్మాస్త్రమున్.
స్ఫాయత్కోకిలకాహళార్భటి యిదే నారాయణాస్త్రం బయో!
కాయోత్పన్నుఁడు నాలుగస్త్రములతోఁ గాఱించెడిన్ నెచ్చెలిన్!

ఉష.—నాతొలితావునకే పోయెద. [అని పరిక్రమించి, కని,] ఏమి యిది, యీనాముద్దులకూనలందు ఈపుత్రరాసులు! ఈ తేనెసోనలు! ఇదేమి యింద్రజాలమా! ఓహో కాదు కాదు.

---

౨౯ ప.—ఇచ్చట, తీఁగల సమూహముల పైకొమ్మలు కొరడాదెబ్బలుగా నామీఁదికి దూఁగుచున్నవి; తుమ్మెదల బారులు చేతులకును కాళ్లకును సంకెలలుగా చుట్టుకొనుచున్నవి. ఈ పూఁదోఁట చెట్లనుండి కాఱుచున్న మకరందధార లనెడు కాల్చిన యినుపశలాకలతో చేసిన పంజరముగా నున్నది. ఇట నున్నచో నాకు క్షేమ మెట్లు గలుగును?

దురము=యుద్ధము.

౩౦ ప.—ఈ మలయమారుతమే వాయవ్యాస్త్రము, మెఱయుచున్న యీ చిగుళ్లగుంపే ఆగ్నేయాస్త్రము, వికసించిన సంపెంగపూవులమొత్తమే బ్రహ్మాస్త్రము, వ్యాపించుచున్న కోకిలకాహళా (సన్నాయి) ధ్వనియే నారాయణాస్త్రము; అయ్యో! ఇచ్చట మన్మథుఁడు ఈనాలుగస్త్రములతో చెలిని ఉషను బాధించుచున్నాఁడు. [బ్రహ్మ బంగారుబొజ్జవాఁడు చంపకము బంగారు వన్నెగలదియు కాంచన నామముకలదియుఁ గావున దానికి బ్రహ్మాస్త్రసామ్యము, నారాయణుఁడును కోకిలయుఁ నలుపు, కావున సామ్యము.]

(తరళము.)

కడిఁదిపూఁతయుఁ గాదు, తేనియ క్రందు వైఖరిగా, దిదే
విడిచి యేఁగెద నన్న మాత్రన విన్ననై యివి దిగ్గనన్
ఒడలు వే నయనంబులై నయనౌఘ మెల్లను బాష్పమై, [౩౧
విడకు మమ్మని చూడ్కులన్ నను వేఁడుతీ రిది చూడఁగాన్

[మదనబాధ నభినయించి] అహాహా! ఏమి యివి! న న్నేఁచుచున్నవి! ఇవి నిక్కముగా పూములుకులే. అయ్యో! నాకూనలారా,

(తరళము)

పుడికి బుగ్గలు ముద్దుగొంటిని; బుచ్చి చుంచులు దువ్వితిన్;
గడకు మీరును వైరిపక్షమె కన్నలార యిట్లైతి రే!
పుడమి నింతటివంత యుండునె, పోలునే మనఁగా నికన్ !
గడిఁదిమారునిచిత్రరేఖమఁ గాన్క నాయుసు రిచ్చెదన్ ! ౩౨

హా ప్రియసఖి! [అని మూర్ఛిల్లును.

చిత్ర.—[వడివడిగాఁ దఱిసి] హా! చిత్రరేఖకా నీవు ప్రాణ మిచ్చెదవు! అహహా; ఎంత ప్రమాదము! ఎంత ప్రమాదము! నెచ్చెలీ, ఉషా, నేనే తప్పు చేసితిని. నేనే కూళను. నిన్ను వంచించి నీయాయాసముం గంటిని. నీతోడిదే గదా లోకము నాకు. నేను లేక నీ వెట్లు? [అని యుష నొడి నిడుకొని] ఆశ్వసిల్లుము సఖీ, ఆశ్వసిల్లుము.

---

౩౧ ప.—కడిఁది=అధికమయిన. క్రందు=కలుచు. దిగ్గనన్=కటాలున. ఒడలు=దేహము. వే=వేయి. నయన ఓఘము=నేత్రముల సమూహము.

౩౨ ప.—బుచ్చి చుంచులు=చిన్నపిల్ల జుట్టులు. వైరిపక్షమె=మన్మథునిపక్షమే. కన్నలార=నన్నుఁ గన్న తల్లులార. వంత=దుఃఖము. మనఁగన్=బ్రతుకుటకు.

(స్రగ్విణి.)

లేవె లేవే, సఖి! లేవె నా గానవే;
యీావు నే నొక్కఁడం చేఁ దలంతుంగదే!
కావవయ్యా హరీ! కావవయ్యా హరా!
జీవలోకం బిదే చీఁకటిన్ మున్గదే. 33

ఉష.—[ఆశ్వసిల్లి చిత్రరేఖకవుంగిట లేచి చూచుకొని] ఆహా! చిత్రరేఖా, ఇప్పుడు నీదర్శనముచే నాకుఁ గరము తాపోపశాంతి కలుగుచున్నది.

చిత్ర.—కర మేమి? నీమనోహరుని పేరు చెప్పుదువేని పూర్ణముగానే తాపోపశాంతి యగును.

ఉష.—[ఆత్మగతము] ఏమి యిది! ఈవృత్తాంతము ప్రియసఖి కెట్లు తెలిసినది? ఎఱుఁగదని తలంచితిని! [ప్రకాశము] సఖీ, నీకు అది యెట్లు తెలిసినది?

చిత్ర.—ఇతరవిషయములు పెక్కులు తెలిసినట్లే.

ఉష.—[ఆత్మగతము] ఈమెమార్గములు తెలియరావు. అటయిన సఖికి ఆమహాపురుషుని పేరుమాత్ర మేల తెలియదు? నే నుచ్చరింప వినఁ గోరికగా నుండును. [ప్రకాశము] సఖీ, అంతటిపుణ్యమా నాకు? నాకది తెలియదు సఖీ.

చిత్ర.—ఏది తెలియదు?

ఉష.—నామనశ్చోరుని నామధేయము.

చిత్ర.—ఆశ్చర్యముగా నున్నది? అటయిన ఆమహానుభావుని యసాధారణ రూపరేఖావిలాసముల వర్ణింపుము.

ఉష.—శక్యమేని. [ఆత్మగతము] నే నెక్కడ, ఆయనను వర్ణించు

---

33 ప.—ఒక్కఁడు=ఒక్కటియే.

లెక్కడ? అయినను చెలియాజ్ఞ? ఏమి సేయుదు! ఎట్టు లీలజ్జాసింధువును దాఁట నేర్తు!

చిత్ర.—[నిర్వర్ణించి, ఉపమోము దడవుచు,] ఇదేమి, సఖీ, నీమే నెల్ల పులకలమొలకలు నిండుచున్నవి?

ఉష.—[తన్నుఁ దాఁ జూచుకొని]

ఆ. పులకపటలి గాదు, మోహనాకారుని
మొలకనగవు మదిని బొలసినంత,
సురిగి సన్నసన్న శోకాంధకారంబు
వలస పోవుటీరు వనజనేత్ర. 38

చిత్ర.—నీవు చెప్ప నక్కఱలేదు, ఈరోమాంచనక్రమముననే తెలియుచున్నదిలే. నీమనశ్చోరుఁడు నిన్నుఁ దేల్చుసకేళీక్రమము.

ఉష.—సఖీ, నీప్రతిభ కగోచరము కలదా!

చిత్ర.—ఏదీ, మఱి వర్ణింపు మాయనస్వరూపమును, నాప్రణయము నుల్లంఘింపవుగదా.

ఉష.—మన్నింపుము సఖీ, చిత్తవృత్తి కుదురకున్నది.

చిత్ర.—[ఉషను నిర్వర్ణించి]

ఆ. హా! యిదేమి సకియ రేయెండ దాఁకిన
తమ్మివైరిజాతిబొమ్మ వైతి!

ఉష.—

ప్రాణనాథునరసఁ బాసినవలవంత
నంగకములు గురియునశ్రు లివి. 39

---

38 ప.—పులకపటలి=గగుర్పాటుయొక్క సమూహము, రోమాంచనక్రమముననే=గగుర్పొడిచినవరుసవలననే.

39 ప.—రేయెం...వైతి=వెన్నెల తగిలిన చంద్రకాంతశిలాప్రతిమ

చిత్ర.—నిన్నుఁ గన్న నీకై యతఁడును ఇట్టియవస్థనే పొందును. చంద్రునికై రోహిణి యెట్లో చంద్రుఁడును రోహిణికై యట్లే యువ్విళులూరునుగదా.

ఉష.—సఖీ, నీపలుకులు ఆశాజనకములు, దీవెనలు, యోగదృష్టవిషయములుగాఁ దోఁచుచున్నవి.

చిత్ర.—అట్లే అగుఁగాక. మఱి నీవల్లభుని స్వరూపముం జెప్పుము.

ఉష.—అనిర్వచనీయముం జెప్ప మనుచున్నావు.

చిత్ర.—వెండియు యత్నింపుము.

ఉష.—నీకూజ్ఞ.

ఆ. ఒకరిబోఁటియాతఁ డొకమాత్రమును గాఁడు,
ఎల్లసొబగులందు హెచ్చువాఁడు,
మంచిరీతి కెల్ల మందిరం బగువాఁడు,
పొచ్చె మేమి లేక పొలుచువాఁడు. ౩౬

చిత్ర.—బళిబళి! అయినను ఇట్టివర్ణన ఎంత యేసియు నొక్కనామమునకు సరిగాదు గదా! వాస్తవముగా నట్టిపురుషుఁ డుండునేని నే నతని నెఱుంగకయుండను.

ఉష.—'వాస్తవముగా' అనుమాటచే నాకు దిగులు గలుగుచున్నది.

చిత్ర.—భయపడకు, అతనిప్రతిమను వ్రాయుము. సాధనములం దెచ్చెద. [అని, పోయి రంగులపెట్టెయు పటంబులును గొని వచ్చి యథోచిత

---

కరఁగినట్లు నీవు చెమరు దాల్చితివేమి ?, వలవంతణ=వియోగ దుఃఖముచేత. అంగకములు=నాయవయవములు. అశ్రువులు=కన్నీళ్లు.

అనిర్వచనీయము=చెప్పుటకు మాటలు లేనిది.

౩౬ ప.—సొబగులు=అందములు; మందిరంబు = ఇల్లు; 'పొచ్చెము=కొఱఁత.

ముగ నుంచి] మఱి కానిమ్ము, నారదులహరికృపచే నీ త్రిజగతియందు సే నెఱుంగనివారు లేరు.

ఉమ.—[ధ్యానించి] ప్రియసఖీ, మహానుభావురాలా, ఇదె యత్నించెదను.

[అని ప్రాంత నభినయించి, కన్నీళ్లు వెళ్లి గొనుటయు, ప్రేళ్లు చెమర్చుటయు వణఁకుటయు, సూచించును.

చిత్ర.—[నిర్వర్ణించి, నవ్వుచు,] చెలీ, ఏమి యిది! చివరకు ఆగంభీరవేదిగాఁడేనా నీమనోదయితుఁడు!

ఉమ.—[ఉలికిపడి] వానిం జేర్కొనకుము సఖీ. హా! నాకన్న మందభాగధేయలు ధరిత్రిఁ గలరే?

నాహృదయంబు తల్లడిల, నాయన నన్ను గభీరవేదికు
ద్వాహము సేయఁ బూనెఁగద,

చిత్ర.— దంతికిఁ దామరతీవియఁ బలెన్;

ఉమ.—

సాహసవర్తనంబునకుఁ జాలను నాయనమ్రోల; నెట్టులీ [32
మోహము దెల్పుదాన నెటు మోడి వహించెడిదానఁ! జెప్పుమా.

అయ్యో! ననేల సృజించెనో విధి! సఖీ, మృత్యువు దప్ప నాకు శరణము గలదా!

చిత్ర.—నాసాముద్రికజ్ఞానమున నీకు నమ్మకము గలదేని నీరూపము దుఃఖమునకై పుట్టినది గాదు.

ఆ. కాదు భంగపాటు, కల్యాణ మగుఁ గాని,
నిష్కళంక రూప నిధుల కెందు;

---

32 ప.—ఉద్వాహము = వివాహము; దంతికిన్ = ఏనుఁగునకు; మ్రోలన్ = ఎదుట; మోడి=మూర్ఖతను.

రాహు వక్త్ర గోచరం బౌనె శశిరేఖ ?
పరమ శివుని మౌళిఁ బరఁగుఁ గాక. 3౭

ఉష.—నీ వేదేవతవు చెలీ ?

చిత్ర.—మఱి గంభీరవేదిగాలింబోలె వ్రాసితి వేమి ?

ఉష.—[కన్నీ ళ్లొలించుచు] హా! ఏమి చేయుదును? మందభాగధేయను? చెలిరో, వ్రేళులు కంప మొందె ప్రతిమం జిత్రింపలేవాయెఁ ; బి
చ్చిలు లేఁజెమ్మటు లల్కిపుచ్చు; గడుగుఁ జిడ్డూడ నీబాష్పముల్ ;
బలుడప్పిఁ నడి డాసి రే వెడసి జంబాలంబునం గూలితిఁ ;
లలనా, దైవము దాయ యైనతఱి నేలా లగ్గు వాటిల్లెడిఁ ! 3౮
అయ్యో ? నేను వ్రాయఁజాలను సఖీ ! [అని యేడ్చును.

చిత్ర.—[కన్నీళ్లు తుడుచుచు] ఏడువకు చెలీ. నాయెఱుంగనివారు జగతిని లేరంటినిగదా. ఇదె చూడు, నే వ్రాసెద; నీ చెలువుని ఇందుం జూపుము.

[అని పటములు గొని వ్రాయును. ఉష ఆశ్వసిల్లి పరికించును.

చిత్ర.—[పటము చూపి] సఖీ, దర్శనమాత్రమున నే నీనాయకుఁడో కాఁడో నీకుం దెలిసినను గుణోత్తరుల నించుక స్వరూపకథనముచే సంభావించెద.

---

3౭ ప.—చంద్రరేఖకు కళంకము లేదు, నిందు చందురునికి కలదు. రాహువు నిండు చందురుని మ్రింగునుగాని చంద్రరేఖను మ్రింగఁడు. అట్లె ఉష నిష్కళంకరూప కావున ఆమెకు భంగము కలుగదు, కల్యాణమే కలుగును. చంద్రరేఖను శివుఁడు శిరమునఁ దాల్చినట్లు ఉషను భర్త తలకెక్కించుకొనును (గారవించును) అని భా.—

3౮ ప.—పిచ్చిలు = ఊరుచున్న ; అల్కి పుచ్చుఁ = ప్రతిమలోని రంగులను పిక్కటిల్లు తముగా కరంగించి కలిపి వేయుచున్నవి ; రేవు ఎడసి = రేవునకు దూరమై; జంబాలంబునఁ = బురదలో; దాయ = వైరి ; లగ్గు = మేలు.— చిత్రరేఖ నదివంటిది—కడమభావ మూహించుకొనవచ్చును.

ఉష.—నీవాగమృతమును వీనులారం గ్రోలెద.

చిత్ర.—సఖీ, ఈతఁడు భగదత్తుఁడు ప్రాగ్జ్యోతిషాధీశ్వరుఁడు.

అంతులు మీఱుదోర్మ్ములఁ జతాలున వీనికటారివ్రేటులన్
గొంతులు త్రెస్సి నెత్తురులు గుబ్బలివాఁకలపోల్కి దూఁకుటల్
వింత వలిప్పుఁ దన్నపుడె పెంశిలి యాజసులక్ష్మి యీతఁడున్
సంతస మొప్పఁ గ్రోవుల వసంతము లాడెనుజాడఁగాఁ జెలీ ౪౦

ఇతఁడా నీమనోదయితుఁడు ?

ఉష.—నామనోహరుఁడు కళ్యాణమూర్తిగదా.

చిత్ర.—ఈమాట గనుము. [అని వ్రాఁత సభినయించి, పటము చూపి,] సఖి, ఈతఁడు సహస్రకిరణునిపుత్త్రుఁడు ; సహజకవచకుండలుఁడు ; కౌరవులదళవాయి ; ఇతఁడు దానవీరుఁ డెట్లో అట్లే యుద్ధవీరుఁడును ; ఇతని యాహవములయందు :—

చుక్కలెల్లను దోఁకచుక్కలై పెక్కులై । ఝుంఝుఘాభినయ మాడుచదురనంగ,
కరములెల్లను గొఱకచ్చులై హెచ్చులై । మిడుతపోటు నటించుచపడు వనంగ,
మిడుఁగురులెల్లఁ గ్రొమ్మించులై మించులై । యొకపందెముగ దాఁటునోజయనఁగ,
వార్ధిభొట్లెల్ల నార్వంబులై దంబులై । యిఱుకు లేనిపయోధి నెనయం టనఁగ,
తే. బుధులు వర్ణింతు రితని కార్ముకమునుండి,
యరిమొనలఁ గప్పు విశిఖ పరార్థములను ;
తరుణి నీ చిత్తచోరుఁ డితండ యేని,
చెపుమ, చెవి పట్టి తెచ్చి నీచెంత నిడెద. ౪౧

---

౪౦ ప.—గుబ్బలి వాఁకల పోల్కిన్ = కొండ యేళ్ల వలె ; తన్ను= ఈరాజును ; అపుడె = ఆయుద్ధసమయమందే ; క్రోవులన్ = గొట్టములతో (పిచికారులతో).

౪౧ ప.—చుక్కలు = నక్షత్రములు ; పెక్కులు = అనేకములు ;

ఉష.—ప్రియసఖీ, నాదయితుఁడు ఒకరిసేవకుఁడు గాఁడు.

చిత్ర.—అటయిన నీమాట చూడుము. [అని వ్రాఁత నభినయించి, పటముచూపి,] సఖీ, యీతఁడు పాండవమధ్యముఁడు, పార్థుఁడు అర్జునాది ద్వాదశాభిఖ్యుఁడు.

క. ఏఁకరె నీతనికై యల
నాకాంగన యుర్వశియు మనఃప్రభవాగ్నిన్;
చేకొని చని యీతని నిజ
లోకమునన్ నాగసతి యులూపి వరించెన్. ౪౨

మఱియుం నీతఁడు,—

నీడమచ్చెముఁ గన్న సింగిమచ్చెము వేసి । కడిమిపందెపుమచ్చెకంటిఁ గొనియె,
ఒకతూరి వేల్పులయొకిమీని వీక్షించి । డంబు మిగాఱినకిరీటంబు గొనియె,
సురరాజుఁ ద్రోచి చిచ్చునకు ఖాండవమిచ్చి । తఱుగనికవదొన ల్ధనువు గొనియె,
ముక్కంటియాదల నొక్కటి వడ్డించి । పాశుపతాస్త్రంబు పంచికొనియె,

---

ఝంఝాభినయము = వానతోడి తుపానుగాలియొక్క నాటకమును; చదురు =సభ; కరములు = కిరణములు; మిడుతపోటు = మిడుతదండు పర్యాటను; వడువు=విధము; మిడుఁగురులు=నిప్పురవలు; క్రొమ్మించులు = క్రొత్తమెఱపుఁదీఁగలు; మించులు = అతిశయమైనవి; ఒక...వీజ = పందెము వేసి దాఁటు విధము; వార్ధి = సముద్రముయొక్క; ఔర్వంబులు = బడబానలములు; డంబులు = అతిశయములు—పెక్కులు; పయోధిన్ = సముద్రమును; ఎనయుట=చేరుట; కార్ముకమునుండి= ధనుస్సునుండి; అరిమొనలన్=శత్రువుల సైన్యములను; విశిఖ పరార్థములను=లెక్కకు మించిన బాణములను.

౪౨ ప.—ఏఁకరెన్=కృశించినది. నాకాంగన = దేవస్త్రీ - అప్సరస. మనఃప్రభవాగ్నిన్=మదనానలముచేత.

ఇట్టి త్రైలోక్యవీరుఁ డీయెమ్మెకాఁడు; చెలియరో, యాతఁడే నీదుచెల్వుఁడేని,
చిన్నిచిన్నారినుడుల వచింపవమ్మ, మీసములఁ బట్టి తెత్తు నీమోసలటను. ౪౩

ఉష.—ఇంతకన్న సుకుమారుఁడు నా ప్రాణవల్లభుఁడు.

చిత్ర.—[వ్రాత నభినయించి, పటము చూపి,]

మత్త. చూడు వీరల వాఁడిసింగపుసూటిపంజుల జాలకన్
బాడిగోడెపుగబ్బికొమ్ములఁ బార్థతమ్ముల నిర్వురన్
నాడెపు జ్జవరాలి గుబ్బల నర్మపుం గరి కోఱలన్ ;
జేడె నీదొర నిండుఁజూపుము, చెచ్చెరం గొని వచ్చెదన్ ౪౪

ఉష.—ఇంతకన్న సులక్షణుఁడు నావల్లభుఁడు.

చిత్ర.—[వ్రాఁత నభినయించి, పటము చూపి,]

(తరళము.)

ముదితరో, కనుఁగొమ్ము వీరల మోహనోజ్జ్వల మూర్తులన్
గొదలు దేఱ జయంతునిన్ నలకూబరున్ సుషమాభరున్

---

౪౩ ప.—మచ్చెకంటిన్ = ద్రౌపది నసుట; వేల్పులయెకిమీనిన్ = దేవేంద్రుని; చిచ్చునకున్ = అగ్నిదేవునికి; తఱుగనికవదొనలు = అక్షయతూణీరద్వయమును; ఒక్కటి=ఒకగ్రుద్దు-లేక-దెబ్బ.

౪౪ ప.—ఉషా, అర్జునుని తమ్ములయిన నకుల సహదేవులను ఈ యిరువురను చూడుము, పరాక్రమ మనెడి సింహముయొక్క సూటితప్పని పంజాలుగాను ధర్మ మనెడి వృషభముయొక్క గుబ్బకొమ్ములుగాను, అంద మనెడి గుబ్బెతయొక్క గుబ్బలుగాను, కేళియనెడి యేనుఁగుయొక్క కోఱలు గాను ఉన్నారు. (తుల్యులు పరాక్రమవంతులు ధర్మవంతులు సుందరులు, కేళికుశలులు అని భా.) నీనాయకుఁడు వీరిలో నొకఁడేని చెప్పుము; తక్షణమే పోయి తెచ్చెదను.

త్రిదశనాయకుముద్దుఁబట్టి నుదీచినాయకుపట్టినిన్ ;
మదిరలోచన, నీ ప్రియుం జెపుమా యిటుం గనుపట్టినన్. ౭౫

ఉష.—సఖీ, ఇట్టి సామాన్యులను వ్రాసెద వేల ?

చిత్ర.—అటులైన, ఈమాఱు గనుము. [అని వ్రాఁత నభినయించి, పటముచూపి,]

వర్ణింపన్ ననుబోంట్లకౌనె సఖి యీద్వారావతీవల్లభున్
అర్ణోరాశిసుతామనోహరుని విశ్వాత్మున్ స్థితివ్యాపృతున్
శీర్ణావిద్య హృదంబుజోదర మహాసింహాసనాధ్యాసునిన్
బూర్ణుం గేవలుఁ గేళిమానుషతనున్ భోగీంద్రతల్పున్ హరిన్.

ఉష.—నీమహిమ నాకు వెఱఁ గగుచున్నది !

క. నాలుకలో శారదయున్,
దూలికలో నజుఁడుఁ, గ్రాలుదురు నీకుఁజెలీ !

---

౭౫ ప.—ముదిపరో = ఓచేడియా ; కొఁదలు తీఱన్ = కోఱికలు తీఱు నట్లుగా-తనివి తీరునట్లుగా ; జయంతుఁడు త్రిదశనాయకుని (దేవేంద్రుని) ముద్దుఁగుమారుఁడు, నలకూబరుఁడు ఉదీచినాయకు (కుబేరుని) కుమారుఁడు ; సుషమాభరున్ = ఉత్కృష్టమయిన శోభను ధరించువానిని - అత్యంతప్రకాశమానుని [ఇది జయంత నలకూబరులకు విశేషణము]; మదిరలోచన = చూచు వారికి మద మెక్కించు నేత్రములు గలదానా.

౭౬ ప.—సఖీ, ద్వారకానాథుఁడును (క్షీర) సాగరకన్య యగుమహాలక్ష్మియొక్క చిత్తమును హరించినవాఁడును, ప్రపంచ స్వరూపుఁడును, ప్రపంచరక్షణమందు పనిచేగొనువాఁడును, ఎవరికి అవిద్య (అహమ్మతి) నశించినదో వారి హృదయకమల మనెడిసింహాసనమందు కూర్చుండువాఁడును, నిండినవాఁడును, అద్వితీయుఁడును, లీలార్థమై మానుషదేహమును దాల్చినవాఁడును, నాగేంద్రశయానుఁడును అయిన యీ శ్రీకృష్ణుని వర్ణించుటకు నాబోంట్లకు శక్యమా

కేలన్ లిఖియించుటగాఁ,

గైతాటము సల్పి నన్నుఁ గలఁగింతుఁగదే! ౪౭

చెలీ, నన్ను వెక్కిరించుటకా నన్ను ముందు వ్రాయుమంటివి?

చిత్ర.—ఈవేమాయలవాఁడేనా నీమనోదస్యుఁడు?

ఉమ.—ఈయన కాఁడు. (వణఁకుచుం గేలు మోడ్చి) ఈయనం గనఁగా నాయెదను భయ భక్తి సంభ్రమంబులు వొడముచున్నవి! నా ప్రాణదయితుఁ డీపోలికనుండును.

చిత్ర.—ఆహా! ఏమి నీయోగము! ఏమి నీతలిదండ్రులభాగ్యము! [అని మరల వ్రాసి, జూపి,] ఈమాట కనుము.

సీ. నీకన్నులీజోడు నెఱపంగఁ డెక్కెముల్, నీయాస్య మీదొర నేస్తకాఁడు,
నీయూర్పు లీజేని సిఖల జైత్ర రథంబు, నీపల్కు లీరాచ నీటుఁ జేసి,
నీదు మే నీశూరు నిర్నిద్ర చాపంబు, నీరోమరాజి యీవీరుమౌర్వి,
నీనడు మీదేవు నిరుపమాకారంబు, నీదులావణ్య మీనేక తాత,
నీపదచ్ఛాయ యీతనిప్రాపుసిరియు, సిరికి సిరి, చిట్టకములకుఁ జిట్టకంబు,
అందముల కంద, మితఁడ నీయనుఁగుఁడేని, భాగ్యవతులందు సకి నీవె భాగ్యవతివి.

---

౪౭ వ.—శారద=వాగ్దేవి; తూలిక = ప్రతిమను వ్రాయుకుంచె; అజుఁడు = బ్రహ్మదేవుఁడు; [సాక్షాత్సరస్వతివలె అద్భుతకవనముతో వర్ణించుచున్నావు, బ్రహ్మవలె (పటమునందు) మూర్తులను సృజించుచున్నావు అనుట.] కేలన్=చేతితో; కైతాటము=మాయ; కలఁగింతు=కలఁత పెట్టుచున్నావు.

దస్యుఁడు=దొంగ.

౪౮ వ.—ఇది మన్మథావతార మయిన ప్రద్యుమ్నుని వర్ణన. వరుసగా—నీకన్నులు మత్స్యములు, నీమొగము చంద్రుఁడు, నీశ్వాసము మలయమారుతము. నీ వాక్కు చిలుక, నీశరీరము పుష్పము. నీనూఁగారు తుమ్మెదల బారు, నీకు నడుము లేదు, నీ దేహకాంతి పాలసముద్రము, నీ యడుగులు చిగుళ్లు. అని భావము; ఈ చెప్పిన యుపమానములు మన్మథునికి వరుసగా

ఉష.—[కేల్మోడ్చి వణఁకుచు] ఆహా! ఏమి నీమహిమ! నావల్లభుఁడు కేవల మిట్లే యుండును. కాని, ఈయన మ్రోల నే నిలువఁజాల. ఈయనను నేను కొలువుడుగత్తెను గాని దయితం గాను. నాసామి యింతకన్నం గోమలాంగుఁడు.

చిత్ర.—మఱి యీమాఱు గనుము. [అని వ్రాయును.

ఉష.—ఆహా! ఈమాఱు నీవు వ్రాయుచున్నావు!

[అని హర్షాశ్చర్యములు పెనంగొన నిర్వర్ణించును.

చిత్ర.—

మత్త. భూరిపుణ్యము జన్మకోటులఁ బ్రోవు సేయనివారికిన్
దీరు సూడఁగనేని యందని ధీర కాంత శరీరునిన్
శూరునిన్ గుణి వీరునిన్ బుధ సూరి గేయ విహారునిన్
మారు ముద్దుఁగుమారునిన్ సుకుమారునిన్ గనుమా చెలీ

[ఉష చిత్రరేఖం గవుంగిలించును.

---

ధ్వజము మిత్త్రుఁడు విజయరథము వాహనము విల్లు నారి అఁగము (మదనునికి దేహము లేదుగదా) మాతామహుఁడు నై యుండుట ప్రసిద్ధము ; కావున ఈతఁడు ప్రద్యుమ్నుఁ డని భావము; నిఖిలజైత్ర = ఎల్లవారిని జయించునట్టి; నిర్ణిద్ర=అమందమైన ; చాపంబు = విల్లు ; నిరుపమ=సాటిలేని ; నేత=దొర ; ప్రాపుసరియు = ముఖ్యసాధనమయిన సురెకత్తి ; చిట్టకము = శృంగారచేష్ట ; అనుఁగుఁడు = ప్రియుఁడు.

ఠీ. ప.—విస్తారమయిన పుణ్యమును అనేకకోటిజన్మములయందు ప్రోగు చేసికొనివారికి ఇతనితీరును చూచుట యైనను ఘటింపదు. అట్టి యీతఁడు గంభీరమనోహరమూర్తి పరాక్రమవంతుఁడు గుణవంతుఁడు ఉత్సాహవంతుఁడు విద్వాంసుఁడు జ్ఞానులు మెచ్చి పాడఁదగినవర్తన కలవాఁడు ప్రద్యుమ్నుని ముద్దుఁగుమారుఁడు కోమలాంగుఁడు. ఇతనిం జూడుమీ ఓ నెచ్చెలీ.

చిత్ర.—ఈమహాభాగుఁడేనా నీసామి?

ఉష.—[లజ్జతో] అవును.

చిత్ర.—బళిబళి! కృష్ణపౌత్త్రుని ప్రద్యుమ్నపుత్త్రుని అనిరుద్ధకుమారుని వరించిన నీకన్న నెవ్వతె ధన్యురాలు! వానివక్షమునం దక్క మహాలక్ష్మి మఱి యొంటం జేరును!

ఉష.—ప్రాణసఖీ, నీమహిమ యనిర్వచనీయము! ఇది మొదలు నేను నీదాసిని.

చిత్ర.—కావు, నాప్రాణమవు.

[అని కడమపటముల నుఱుమాడి దాఁచును.

ఉష.—[అనిరుద్ధప్రతిమ నుద్దేశించి] ప్రాణేశ్వరా.

(దక్షిణాంతిక.)

నవనీత సనాభి మూర్తివై, పవిధారా పరిభావి గా మదిన్ [౫౦
సవరించితి సామి యేలొకో, వివరంబుగ వినిపింపుమా యుషన్.

చిత్ర.—ఆయన నుపాలంభింప నేల! స్వప్నమే గదా. నీవృత్తాంతము ఆయన ఎఱుంగఁడేమో? అట్టియుందార ప్రకృతులు దయాదూరములుగా నేరవు.

ఉష.—సత్యము సత్యము. నీ చెప్పుడును వివేకమంజులవు. [ఆలోచించి] ఎఱుఁగనిచో ఆమహాభాగుఁడు ఈమందభాగ్యను సరకుగొనునా?

చిత్ర.—ఎఱిఁగినచో, 'ఈమందభాగ్యని ఉష సరకుగొనునా' యని యామహాభాగుండును వచించును.

---

నుఱుమాడి = చింపివైచి.

౫౦ వ.—ఓసామీ, వెన్నకు తోఁబుట్టువైన రూపము కలవాఁడ వయ్యును నీహృదయమును మాత్రము వజ్రాయుధపు వాదరకన్న కఠినముగా చేసికొంటివే, అందుల కేమి కారణమో ఉష నయిన నాకు వివరించి చెప్పుము.

ఉష.—సఖీ నీ వాశ్వాసము పలుకుచున్నావు.

చిత్ర.—నే నెప్పుడును వివేకమంజుల వంటిదని గదా.

ఉష.—నీచిత్తము.

చిత్ర.—నీవల్ల భువి శశిమందాకినీప్రసాదమునకుం దెచ్చెద.

ఉష.—[కవుంగిలించి] ఏల నాతోఁ బుట్టవైతివి?

చిత్ర.—ఇంతటియనురాగము ఉండదని.

ఉష.—[చిత్రరేఖం గవుంగిలించి ముద్దుగొని] నానాలుక కృతజ్ఞతా జడమై యున్నది. ఏమియుం బలుక నేరకున్నాను. [ఆశ్చర్యముతో కవుంగిలి సడలించి] ఏమి యిది! నీయొడలును ఇంత వేఁడిగా నున్నది.

చిత్ర.—[నవ్వుచు] నీకౌఁగిట చాలసే పుంటిని గదా.

ఉష.—నిజము చెప్పవా?

చిత్ర.—[నవ్వుచు]

క. ప్రాణంబు క్రాఁగెనేనిన్,
మేనుం దాఁ గ్రాఁగు టరుదె మేదినిలోనన్?
ప్రాణమవు నీవు క్రాఁగిన,
మేనను నేఁ గ్రాఁగితిని దమీరమణాస్యా. ౫౧

ఉష.—మృష వచించుచున్నావు. కానీ, తర్వాత ఎటకుం బోయెదవు?

మ ద ని కా కు ము ది క లు.—[ప్రవేశించి] ఇదిగో చందన క్షీరము.

చిత్ర.—ఉష యిప్పటికి స్వస్థపడినది. ప్రకృతము ఉషను కర్పూర సరసికిం గొనిపోయి జలక మాడించి యీమదనప్రతిమను,—ఆహా! ఇందు కేలం బూవిల్లు వ్రాయ మఱచితిని! ఇదె వ్రాసెద. [అని అట్లు సేయుంట నభినయించి] ఈమదనప్రతిమను పూజసేయింపుఁడు. [అని చిత్రపటము నుప

౫౧ ప.—తమీరమణాస్యా=నిశానాథవదనా=చంద్రముఖీ.

చేతి కిచ్చి] తర్వాత ఉషను మందాకినీ ప్రసాదమున వదలుఁడు. నేను ఉషకు అప్రతిరుద్ధోపచారముం దెశ్చెదను.

మద., కుము.,—నీయాన.

చిత్ర.—ఉషా, నేను పోయి తెచ్చెదను. [అని పైకెగసి]

భుజంగ. జొహారు రో కపాలీ, జొహారు రో కరాళీ,
జొహారు రో గురూ, నాసుత్ కా బెశలాంగి కా
గొహార్స్నేయు దధ్గాంగు చెద్దుంబు దిద్దకా
మహామాయు, నాకుకా మహాసిద్ధి యిష్యా ౧౨

[అని నిష్క్రమించును. కరేణుక తొంగి చూచును.

మద.—రారమ్ము ఉషా, కర్పూరసరసికి. చిత్రరేఖ ఎవరో దేవత. ఆమెమాట మనము జవదాఁటఁగూడదు. [అని ముగ్గురు నిష్క్రమింతురు.

కరే.—[ముందటికి వచ్చి] ఉషకి యెండదెబ్బ తగిలిందని నాతో మదనిక చెప్పింది. [నిర్వర్ణించి] యీతామరాకులపడక దానితాపాన్ని పోగొట్టిందిగదా. గంభీరయ్యమీదివున్నమూలంగా నావొళ్లు వుడుకెక్కిపోతూ వుంది. యీపరుపుమీద నేను చల్లబడతా. [అని యీతామరసెజ్జపైఁ బడి దొరలుచు] నాకు మొదలే వుషమీద మహాప్రేమ. దానికి నారాయుడిమీద మనసు లేదుగనుక యిప్పుడు చెప్పాలిశిందే లేదు. యీపరుపుకోసం కూడా నాకు దానిమీద ప్రేమే. [దొరలుచు] సీత్, యిది నా కేమూలకి? యిదేమి వేడిగావుందే! వోయి బాబో! రోగం వొకటే అయినా అందఱికీ వొకటే

---

౧౨ ప.—పుఱుకదాల్పువైన యోగివుఁడా, నీకు నమస్కారము; చండీదేవి, నీకు నమస్కారము. ఓగురూ నారదమునీ, నీకు నమస్కారము. కోమలమూర్తి యయినయీరాజకన్యను ఉషను కాలిపోవఁజేస మన్మథుఁడు చంపుచున్నాఁడు. వాని చెడుచేఁతను దిద్దటకై, ఓమహామాయాదేవీ, నాకు ఉత్తమ మయిన ఆకాశయానాది కార్యసిద్ధిని అనుగ్రహింపుము.

మాత్ర పనికిరా దని మునుపు వైద్యు లన్నారు. మాతత్వాలు వేరుగదా. అది సన్నగా తెల్లగా రోతేస్తూ వుంది. నేను గుండ్రగా నల్లగా ముద్దొస్తూ వున్నాను. అయితే వెలపలికి వేడయితే లోపలికి చలవట, చిత్రమూలంటాగ. కనక లోపలికాక పోవడానికి వీట్ని తినేస్తా. [అని ఆట్లే చేసి] యిది నా కేమూలకి! మాయింటికాడిపెద్దచెఱువుగ్గోపడి ఆందులో వన్నీ తినేశి ఆచన్నిళ్లన్ని తాగేస్తా. చన్నీళ్లకంటే చలవ మర్లేదు. పాడతా.

నేను గంభీరన్ని పెళ్లాడితే, బళీ! నేను..., వవ్వా! నేను..., సెబాస్!
నే నాత డికి కూడు వొండిపెడ్తాను.
నన్ను గంభీరయ్య పెళ్లాడితే, బళీ! నన్ను..., వహ్వా! నన్ను...,సెబాస్!
నాకాత నూ మంచి నగలు పెడ్తాడు.

వొరులు న న్నూ న న్వ కుండా, బళిబళీ! వొరు..., బాపురే! వొరు...,
సరికి సరి గానె వొలి చితిని. ,, సరి ... ,, సరి...
కొందఱూ జంటల లాగ, ,, కొంద ... ,, కొంద...,
ఎందునా మేము పో రాడం. ,, ఎందు ... ,, ఎందు....
పొంకనా ల్వాళ్లకీ కు దరా, ,, పొంత..., ,, పొంత...;
అంతాను మాకూ కు దిరికే. ,, అంతా... ,, అంతా....
కడుపూ, కుడుపూ,
నలుపూ, బలుపూ, అంతా.... ,, ,, ,, ,,
జగడం, నగడం,
అరవడం, కరవడం, ,, ,, ,, ,, ,,
అన్నిటికి పైగా అడ్డగా పెరగడం ,, ,, ,, ,,

[అని వికృతనాట్యము లాడి నిష్క్రమించును.

ద్వితీయాంకము ముగిసినది.

---

# ప్ర వే శ క ము.

స్థలకము :—ద్వారక, శ్రీకృష్ణప్రాసాదోద్యానము.

ఉ ద్యా న పా లి క ప్రవేశించి

తోఁట నలంకరించుచుండును.

ద్వితీయ.—[ప్రవేశించి] వోశే బంబరికా, యేమే నువ్వింకా యీతోఁటని అలంకరించకున్నావ్, కొమారమహారాజు అనిరుద్ధులవారికి మరీ యిష్టమైనతోఁట గదటే యిది!

ఝంఝరిక.—వోశే కీరవాణీ, నీపని రవ్వంత ముంగట అయిందని యేం బడాయే నీకు! యిదుగో ముగించాను చూడు. మరి మొన్నడిగితే ఆనక చెప్తా నన్నావే యిప్పుడు చెప్పశ్శి, మునుపంతా యెప్పుడో యిక్కడికొచ్చే కొమార మహారాజు యిప్పుడు రోజల్లా వొంటరిగా యీతోఁట్లోనే తిరుగుతూవుంటాడే అదేమిటి?

కీరవాణి.—ప్రెబువులచిత్తానికి కారణం యెందుకే!

ఝంఝ.—మరి, చక్రవపిట్ట లని జకలుకట్టి వాటిమీద యేమిటేమిటో చిత్రాలురాస్తాడే అదెందుకే?

కీర.—నువ్వెరగోదవే? పీటికోసమే.

[అని ఝంఝరికపాలిండ్లం బొడుచును.

ఝంఝ.—ఎగతాళటే?

కీర.—కాదు దిగతాళే. ఎవతెమీదనో మనసుపడ్డాడే.

ఝంఝ.—పడితే?

కీర.—ఆమెవి అవే యివని పీటికి అలాగ అలంకారాలు చేస్తాడు.

ఝంఝ.—నెమలిపిట్టల్ని పట్టుకొని వాటికుంచెలు దువ్వి వాటికి పువ్వులు చుడ్తాడే అదెందుకూ?

కీర.—వొకటి చెప్తే కడమన్ని తెల్సుకోలేవటే? ఆమెకలకట్టు కలుచుకొని వీటికి శేవలు చేస్తున్నాడు.

బంధ.—శబాస్ శబాస్. మరి ఆగుడ్డిచెంబడికి వాకకాడ తెలవనీకుండా వాడిగాలానిముల్లు తీశేశి వృత్తతాటికి జిలేబీలు కట్టినాడు నిన్న, వాడికి తెలవనీకుండానే వాడిబుట్టలో వొరాలబొట్లం వేశినాడు.

కీర.—చాపలు ఆబాగ్గెమంతురాలికళ్లలా గున్నాయఁట. అటుపైని తెల్సుకో. చాపలు పడకుంటే ముసలివాడికి మెదుకు ల్లేవని వొరాలు పడేసినాడు.

బంధ —ప వ్వొకర్న్నో మడకని పడ్డావే.

కీర.—రాయే లంజా, నువ్వు కూడా పడుదుగాని.

బంధ.—యింకొకటిమాత్రం చెప్పు. ఆవాకలోకి దిగి ఆయ సెందుకే ఆసుళ్లని వెతికివెతికి ముద్దెట్టుకొంటాడు ?

కీర.—చాల్లే యీపాటికి. నువ్వేవణ్ణయినా వొకరంగణ్ణి తగులుకొని రాత్రి వాణ్ణడుగు చెప్తాడు. నీకేమి చీకటిబయ్యం లేదటే ?

[అని నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

---

మడకని = మడకలో = అరకలో. మడకని బడ్డావే = పురుషునింబొందిలివని భా.

# తృతీయాంకము.

స్థలకము:—ముకుపటిజే.

చిత్రరేఖ ఆకాశయానమున ప్రవేశించును.

చిత్ర.—ఆయుద్యానపాలికల సంభాషణవలన కుమారమహారాజు అనిరుద్ధుఁడు విధన్యురాలికొఱకో విరాళిం గూరుచున్నాఁడని తెలిసెఁగదా. తిరస్కరిణీప్రభావంబున రాచనగరుసొచ్చి యామహాపురుషుం గంటిని. విరాళిచే వాడి వత్తియయ్యును సాయోపాసనలు చేతస్సమాధితో యథావిధి ఒనర్చి కృతాహారాభినయుండై శయనం బొల్లక యీయుపవనికే యేతెంచుచున్నాఁడు. తలిఁ వేచి కొనిపోయెదఁగాక. ఈవిరాళి నా ప్రాణసఖికొఱకే యగును. [చదలం గాంచి] ఆహా! యీ చంద్రుఁ డింత రమణీయుండయ్యును ఏఁచును కదా!

అనిరుద్ధుఁడు విరహకృశుఁడు ప్రవేశించును.

అని.—[నిట్టూర్పు పుచ్చి] హా! ఈవెన్నెలకు చలనగుణము వెండియు నెన్నఁటికిఁ గలుగునో! అహహా!

(ఔపచ్ఛందసికము.)

విరహార్తుల ద్వేషి యై దహించుఁ,
విరహాతీతుల నెయ్యుఁడై భజించుఁ.
'పరికింతు రవస్థ' నన్న సూక్తిఁ
బరమార్థంబుగఁ బద్మవైరి సేయుఁ. 43

43 ప.—ఈచంద్రుఁడు విరహపీడితులను శత్రువై కాల్చును. విరహము దాఁటినవారిని మిత్రుఁడై సేవించును. 'లోకులు మనుష్యుని వానియవస్థకు తగినట్లు చూతురు,' అనఁగా, 'బలవంతునికి మ్రొక్కుదురు, దుర్బలుని కొట్టుదురు;—అన్నసుద్ది వాస్తవ మని ఈచంద్రుఁడు తననడవడిచేత నిరూపించుచున్నాఁడు.

చిత్ర.—ఓహో! సత్యము సత్యము.

అని.—ఓయి చంద్రుఁడా, నీపగకుఁ గారణము తెలిసినది?

నిరతజ్యోత్స్న మటంచుఁ దద్వదనమున్ నే మెచ్చుటం జేసి కా
యజవిందాహిత నన్నుఁ జూఁడెదవు నీహస్తాగ్రదీపార్చులన్;
శరముల్ సూదులు బాఁకు లీఁటెలు కశల్ సారింతు నాపై; నహో!
ధరలోనన్ నిజ మాడ నిష్ఠురము కాదా! సామెతల్ దప్పునే. ౫౪

చిత్ర.—'నిరతజ్యోత్స్న మటంచుషావదనమున్' అనఁడాయెనే!

అని.—ఓయి కళంకీ,

చొక్కంపుంగలశాబ్ధిపట్టి కెటు వచ్చెన్ మచ్చ! నీగుట్టు నే
వక్కాణించెద:—నంశునాళకము నావక్షంబునన్ నాటి, నీ
వక్కాంతాస్యము దోఁపమిన్ రగులు నాస్వాంతంబుగంజాయిగా
హుక్కాగ్రోలుపొగ ల్లాగంబలమె నం;చో తుర్కమాన్వేలుపా.

---

౫౪ వ.—సదా వెన్నెల గలయట్టి దని ఆప్రాణేశ్వరిముఖమును నేను మెచ్చినందునఁ గదా ఓకమలవైరీ, నన్ను నీచేతికొన నున్న దివ్యజ్వాలలతో (నీకిరణముల తుదలజ్వాలలతో) కాల్చుచున్నావు; నామీఁద బాణములు... కొరడాలు ప్రయోగించుచున్నావు. అయ్యో! భూలోకమందు నిజ మాడిన నిష్ఠుర మన్న సామెత తప్పదాయె, గదా.—చంద్రునికి రాత్రియందుగాని పగట వెన్నెల లేదు, ఉషావదనమునకు వెన్నెల రేలుం బవలులుం గలదు, కావున అనిరుద్ధుఁడు చంద్రునికన్న ఉషావదనమే ఉత్కృష్ట మని మెచ్చినాఁడు... విరహబాధలో చంద్రుఁడు సేయు నుద్దీపనమును అనిరుద్ధుఁడు సహింపకున్నాఁ డని భా.

౫౫ వ.—పరిశుద్ధుఁ డైన క్షీరసాగరుని కుమారునికి నీకు ఈకళంకము ఎట్లువచ్చినది? (ఇది నీపుట్టువుతో వచ్చినది కా దని భా.) నీ రహస్యమును నేనుచెప్పెదను విను. నీవు తురకలదేవుఁడవు కావున వారివలెనే హుక్కా-

చిత్ర.—అహా! ఎంతసరసోపాలంభము!

అలి.—అయ్యా, ఓషధీశ్వరా, నీవు ముగ్ధుఁడవో క్రూరుఁడవో.

సతము౯ రోహిణిఁ గూడ లేనివనట౯ జాఁజిక్కి నీవే యిటుల్
వ్రతమో నాఁగ వియోగిపాళిఁ బయి నావాల్ నూఱవింతౌ శశీ!
మతమో నీకును నోషధీశుఁడ భిషఙ్మర్యాదగా సృష్టిలో. [గీ౯
నితరప్రాణులగాయ మవ్యథము నీదే దుర్వ్యథాశ్వంబుఁ గా౯.

[గాలి సోఁకినందులకు ఒడలు జలదరించుట నభినయించి] ఓయి మలయానిలా, ఏల నన్ని క్లేశపెట్టెదవయ్యా ?

ఆ. చలువ తెమ్మెర యను పలుకు దబ్బఱ సూవె;
దక్షిణుండ వనెడు తత్త్వ మిదిగో;

---

త్రాగెదవు. నీవు నీకిరణ మనెడు హుక్కాఁ గొట్టమును నాహృదయములోఁ గ్రుచ్చి, ఆ ప్రాణేశ్వరి వదనము నా కగపడ నందుకై రగులుకొనుచున్న నా హృదయకమలమే గంజాయిగా హుక్కా త్రాగుచు పొగను వెలిఁబుచ్చుచున్నావు; ఆపొగ ని న్నావరించినది, అదియే నీమచ్చ.

ఉపాలంభము=నింద. ఓషధీశ్వరా=ఔషధపు మొలకల దొరా. ముగ్ధుఁడవో = తెలియనివాఁడవో.

గీ౯ ప.—అన్ని తిథులయందును నీ ప్రియతమ యైన రోహిణితోనే కూడియుండమిచేఁ గలిగిన దుఃఖముచేత చచ్చినట్లుగా కృశించుచున్న నీవే వియోగులను బాధించుటకై దీక్ష వహించితి వేమో యనునట్లుగా వారిని హింసించుచున్నావు! ఇది వింతగానున్నది. లోకములో ఓషధులను వినియోగించువాఁ డగు వైద్యుఁడు తన వ్రణంపుఁగోతయే సహింపరాని నొప్పి గాని ఇతరుల వ్రణముం గోసిన నొప్పి యేమియుం లే దని తలంచినట్లు నీవును ఓషధులకు దొరవు గాన వారి వలెనే అభిప్రాయపడియున్నావా ?

విరహి జనుల జీవ వితతి నువ్వెత్తుగా
నూఁదిపైచు జముని యూర్పు వీవు. ౫౭

చిత్ర.—అయ్యో! సుకుమారుఁడు ఎంత గాసిలుచున్నాఁడు!

అని.—రహస్యము దాఁచుట యనునిపుటపాకమున నెంతకాలము వేఁగుదును? బిగఁబట్టిన యూపిరిని సడలించుట గదా రహస్యము చెప్పికొనుట? వయస్యుఁ డేమియు నగపడఁడుగదా?

చిత్ర.—అయ్యో! కుమారమహారాజు మహావిరహతాపమునం బొగులుచున్నాఁడు! [మఱియొకదెస నిర్వర్ణించి] ఈతఁ డెవరో విప్రకుమారుఁడు ఇతనిమిత్త్రముపలె నున్నాఁడు. ఇతనిం గడుం గూర్మితో వెదకి వెదకి కనిపట్టి హర్షపరవశుఁడై పరుగున వచ్చుచున్నాఁడు.

విదూషకుఁడు ప్రవేశించును.

అని.—[చూచి] ఆహా! నాడాయనా, కూర్చుండుము కూర్చుండుము.

విదూ.—వయస్యా, నీ వేమి యీవొంటిపాటును వెళ్లాడినావా? ఈ మోసం మమ్మల్ని వదిలేశినావే?

అని.—దుఃఖితుఁడు మంచిసహవాసము గాఁడని మిమ్ముం గూడనైతిని.

విదూ.—దుఃఖితుడికి దుఃఖితుడు మంచిసావాసమే గదా.

అని.—కానీ;

విదూ.—అటుయితే మనసహవాసం మంచిదే.

అని.—ఎట్లు?

విదూ.—నిన్ను చీమ కుట్టిందో దోమ కుట్టిందో ఆదుఃఖం నీకు, నిన్ను చూడనిదుఃఖం నాకు.

---

౫౭ ప.—తెమ్మెర = గాలి; దక్షిణుండు = దయగలవాఁడు (దక్షిణదిక్కువాఁడు)—నీ దక్షిణత్వము దయార్థమందు లేదు; వితతికి = సమూహమును; ఉవ్వెత్తుగాక = క్షణములో; జముని = దక్షిణదిక్పతియైన) యమ ధర్మరాజుయొక్క - ఊర్పవు = శ్వాసమవు.

అని.—నన్ను ఏమయుఁ దోమయు గుట్టినవా ?

విదూ.—మఱి నీకు దుఃఖ మేమి? మడకలో నల్లి కుట్టిందా? తలకాయలో యెవతేనైనా పే నేమైనా కుట్టిందా ?

అని.—ఛీ ! మూర్ఖా !

విదూ.—అవును, మ రేమి దుఃఖకారణం ?

అని.—ఏల యడిగెదవు వయస్యా !

విదూ.—[ఆటోపముతో] చెప్పకపోతివా జంఝాలు వురి పోసుకొని నీకు బ్రహ్మహత్య కడతా.

అని.—అంతపని చేయకు. నీపరాక్రమము నే నెఱుఁగుదును. చెప్పెదను.

విదూ.—చెప్పు మరి.

అని.—మదనసర్పము కఱచినది, విష మెక్కినది.

విదూ.—మదన మంటే నాకు తెలియదు. ఏజాతో మన పేళ్లతో చెప్పు, మంత్రం వేస్తా.

అని.—వయస్యా, నే నొకనాఁడు కలలో నొకజగన్మోహినిని వరించితిని.

విదూ.—[పకపక నవ్వి] ఆవేళ వుండ వేసుకొన్నావా యేమి !

చిత్ర.—ఈయనకును కలలోనే గాంధర్వము! అహో! సంవిధానము!

అని.—[విదూషకుని చేయి పట్టుకొని] కుదురుగా వినియెదవా లేదా?

విదూ.—అయ్యో, అయ్యయ్యో, అమ్మ కొక్కణ్ణి, అబ్రంహణ్యం అబ్రంహణ్యం! నన్ను బ్రమ్మహత్య కట్టొద్దన్నావే, నీవే ఆరంభించా వేమి మహారాజా !

అని.—[చేయి వదలి] కలలో వరించి మేల్కొని కానక యీయవస్థకు వచ్చినాఁడను.

విదూ.—(పక పక నవ్వి) వొకనాడు నేను మంథానభైరవం మింగి పొమ్మన్నిల్లి కలలో మిఠాయికొండ వొకటి నే నొక్కణ్ణే తిని, మునపటికంటే

---

మంథానభైరవము=ఎంతభక్షించినను చాలనట్లుగా చేయునట్టి యొకమందు.

ఎక్కువ ఆకలితో మేలుకొన్నాను. అప్పట్నుంచి పదిహేనురోజులు ఆ కొండే కావాలని ఇంట్లోవాళ్లని యేడిపించాను. పదహారోనాడు పెదనాయన నాతో చెప్పకుండా జుట్టు పట్టుకొని పేపావారిపిల్లని నాకు పెళ్లిచేశాడు. ఆమహోత్సవంలో మిఠాయికొండని మరిచిపోయి స్వస్థపడ్డాను. నీవున్ను నా దారికే వొస్తూ వున్నావు. ఎటయినా నావయస్యుడివే గదా.

అని.—తిన్నగా వినియెదవా లేదా ?

విదూ.—వున్నమాట చెప్తావా లేదా ? కలంటేమాత్రం నేను నమ్మను. కలకోసం వొకడు నీలాగ యేడుస్తూ వుంటాడా ? పాడుకలొస్తే కుట్టాడైతే అప్పుడు రవంతసేపు యేడుస్తాడు.

అని.—సత్యము వయస్యా, నామాట.

విదూ.—అలైతే అడేదో పిశాచం. కామినీ మోహినీ శాకినీ ఢాకినీ బడబాకినీ దయ్యాలలో ఒకటి. ఆకథ వింటే నన్నుకూడా ఢాకిని వెంబడిస్తుంది.

అని.—మిత్త్రసిమీఁదియాఁగను కత్తితోఁ గొట్టుక్రోఁలివి నీవు.

విదూ.—[మొగము చిట్లించుకొని] నీవో, వెతుక్కొని వొచ్చినందుకు వేళ్లు నలిపి బ్రమ్మహత్య చేశే రాజాధిరాజవు. [మందహాసముతో] పోనీగానీ, అలైతే, తూ చా తప్పకుండా ఆమెస్వరూపాన్ని వర్ణించు, నాకు సాటొస్తుందేమో చూస్తాం. నిజమైతే అసలే నేను చూడకపోతానా ?

అని.—మంచిది, నా కిష్టమైనపనియే; వినుము.

విదూ.—సిద్ధము. అందుకే చెవులు చికిలిచేసుకొంచున్నాను. [అని చెవులు దీఁటుకొనుచు] ఇందుకు బదులు పేపావారిపిల్లని నేనూ వర్ణిస్తాను. అది నువ్వు వినకపోతే యిది నేనూ విననుక.

---

పేపావారిపిల్ల యనఁగా ప్రేఁకబెత్తము, దానిని పెండ్లిచేయుట యనఁగా దానితో కొట్టుట.

అని.—

ఆ. చిమ్మచీఁకటులను జిమ్ము పవల్సేయు
మోహనాంగిముద్దు మొలక నగవు;
రమణిమోము మ్రోల రాకామృగాంకుండు
కాముఁ డెత్తు దృష్టిఘటము సూవె. ౫౭

విదూ.—ఇదేమో అపూర్వమే. మరి మా పేపావారిపిల్లకి తుక్కుతల, పూసకళ్లు ఎంతస్వారస్యంగా చెక్కివున్నవి! వయస్యా, అటుపైన?

అని.—వయస్యా,

ఆ. సంజవేళ లేఁతజా జొంది చుట్టురాఁ,
దలను చవలినీడఁ దాల్చి సుంత,
జంట నొప్పు దొడ్డ జమ్మేటి బుగ్గలా,
కొమ్మ గబ్బిగుబ్బ కోరకములు! ౫౮

విదూ.—బలిబలి! మా పేపావారిపిల్లకి [అనిరుద్ధుఁడు విదూషకునికిం దెలియనీక చెవులు మూసికొనును.] అవి లేవు. మెడలో రెండుపట్టుకుచ్చులు మాత్రం వేలాడుతున్నవి, వయస్యా, ఇంతేనా!

అని.—విను వయస్యా,

---

౫౭ శ.—రాత్రి ఆ మోహనాంగియొక్క ముద్దులేఁతనవ్వుచేత గాఢాంధకారముం బాసి పట్టపగటివలె వెలుంగును; నిండుపున్నమచంద్రుఁడు ఆమె ముఖమునకు దృష్టి తగులకుండుటకై మన్మథుఁడు నిలిపిన దృష్టిపిడత సుమా.

౫౮ ప.—ఆకోమలియొక్క మొగ్గలవంటి నిండు గుబ్బలు—సంధ్యా కాలమందు తమచుట్టును లేఁతగా ఎఱుపుం బొంది, తమతలయందు ఆకాశపు నీలిమయొక్క ప్రతిబింబము కొంచెము కలవై, జంబూనదిలో జంటగా నొప్పుచున్న పెద్దక్షబుడగలా ఏమి?

చందున కాత్మబింబసదృశంబుగ గుండ్రకవల్ జనించి యా
పిందెలు చుక్కగా నడుమ బింబములన్ జిఱుమచ్చ దాల్చి పైఁ
బొందుగ జాఘరారసము మూర్తుల లేఁతగ నద్దికొన్న నా
సుందరిగబ్బిగుబ్బకవ సోయగ మొందెడి నేమొ మిత్త్రమా. ౬౦

విదూ.—ఆపిల్ల మూలంగా కవీశ్వరుడివై పోతున్నా వేమి వయస్యా! చెడిపోతావు సుమా! పోనీ ఆమెబాహువు లెటువంటివయ్యా?

అని.—

క. తాఁకియుఁ దాఁకనిమాత్రన
యేకపదమ వింతమోహ మిడుమరుని ప్రసూ
నాకలితపాశ రాజము
లాకోమలిబాహువల్లు, లలవియె చెప్పన్! ౬౧

విదూ.—అ దేదో పిశాచ మని నేను మొదటనే చెప్ప లేదా. మా పేషావారి పిల్ల మాత్రం [అనిరుద్ధుఁడు మునుపటివలెనే చెవులు మూసికొనును.] మదనపాశంలాగ లేదుగాని యమపాశంలాగ వుండినది. మొత్తానికి పోలిక వుంది. బళిబళి! కనకనే నీకింత వెఱ్ఱిపట్టింది. ఇంకా? ఆబొబ్బట్లమడతలను వర్ణించవయ్యా.

---

౬౦ ప.—చంద్రునికి తనబింబమునకు పోలికగా ఇరువురు కవల పిల్లలు పుట్టి, లేఁతపిందెలవంటి యాకవలు దేహమధ్యమందు చిన్నమచ్చను గుండ్ర మయిన చుక్కగా ధరించి, పైఁగా చక్కఁగా జాఘరాద్రవమును లేఁతగా తమమూర్తులకు అద్దుకొన్నయెడల అప్పటికి ఆకవలు ఆసుందరియొక్క నిండు పాలిండ్ల సౌభాగ్యమును పొందు నేమో.

౬౧ ప.—ఏకపదమ=ఒక్కుమ్మడిగా. మోహము=పరవశత్వము. ఇడు ...జములు = కలిగించునట్టివి పుష్పములతో చేసిన మన్మథుని పాశాయంధ శ్లేషములు.

అని.—వినుము మిత్త్రమా ;

హృదయజుఁ డాత్మకామినికి నీఁతలు నేర్పుటకున్, దదర్థమా
మృదుచరణాంతరారమున మెచ్చొదవన్, బరువంపుమంత్రి వే
పదిలము సేయు డిగ్గియయు, బంగరుఁదాపలు, నీలిమొహ్రాలు
స్ఫదవసనంబుఁ గా, దయితనాభియు, ముత్తఱు,లారుఁ,జెన్నగున్.

విదూ.—[అనిరుద్ధునిచేయి పట్టుకొని] బాపురే! బాపురే! వయస్యా మాడుముడతలకే యింతవర్ణనైతే మాపేపావాడపిల్ల వెనకనుంచి కాగలించుకోగానే నాపీపంతా వణ్ణే, అది కగిలినచోటంతా వణ్ణే! అందు కెంత వర్ణన కావలెనో?

అని.—ఎంత తెలియనివాఁడవు వయస్యా!

విదూ.—[కనికరముతో] మన్నించు వయస్యా, యిక ఆపిల్లని వర్ణించను.

అని.—అట్టియాచెలువ నేపథ్యము—

(పంచచామరము.)

మృషావలగ్న జిల్గుపైఁట మించుసన్నమం చగున్;
ఝషాంకుదట్టి మన్న సంజజాజులోని రే కగున్.

---

ఉ॥ ప.—దొర యైన మన్మథుఁడు భార్య యయిన రతీదేవికి ఈఁతలు నేర్పుటకుఁగా యౌవన మనుమంత్రి నిర్మించిన దిగుడుబావివలె పొక్కిలియు, అందులో దిగునప్పుడు మెచ్చుగలిగించుటకై మృదువుగా నుండునదిగా కట్టించిన బంగారపుమెట్లవరుస బలె వళిత్రయంబును, ఆమెట్లవరుసపై పాదములకు ధూళ్యాదిక మంటకయుండ మృదువుగాను ఉండుటకై దారిగా పఱచినట్టి నల్లముఖమలుపట్టు రేకుబలె ఆ తరుణీమణి నూఁగారును ఒప్పుచున్నవి.

నేపథ్యము=అలంకారము.

తృషాకృశోష్ఠిభూషణాళి రిక్కలున్ మెఱుంగు లౌ ;
నుషావతార మంచుఁ గాంత నూహ సేయుదున్ సఖా. ౬౩

చిత్ర.—ఆహాహా! ఉషావతార మనుకొన్నాఁడు! ఉషయే యని తోఁచుంగఁడు!

అని.—అట్టియాజగన్మోహిని.

ఆ. అట్లుగానె పుట్టినట్లుగా నగపడు ;
నోలి నెదిగె ననుట యొప్ప రాదు ;
మార్పువొందురీతి మదిలోనఁ దోఁపదు ;
అసురమాయొ కొమ్మ యమరమాయొ ! ౬౪

చిత్ర.—ఉభయమాయ సుమా.

అని.—అట్టి యాముద్దుగుమ్మ నన్నుఁ దేల్చినయాముహూర్తము నా జన్మములో నెట్టిదో చెప్పవలయునా?

విదూ.—[ఆత్మగతము] వయస్యునిదుఃఖ మేమో వాస్తవంగా మేర మీరిందిగా వుంది. అయ్యో పాపము! అట్టికన్య వుండునా? కలలు నిజంగా ఫలించునా! [ప్రకాశము] వయస్యా, వగవకు. నీకు మేలు కలుగుతుంది.

---

౬౩ ప.—మిథ్యామధ్య (అనఁగా నడుము లేనిది) అయిన యాచెలువ యొక్క సన్నని పయ్యెద ప్రకాశమాన మయిన సన్నని మంచుగా నగపడు చున్నది. (తెల్లనిది), ఆమీననయనయొక్క పావడ యన్నదో సంధ్యారాగములోనుండి కత్తిరించిన రేకుగా నున్నది (జాభరావన్నది), ఆసగొల్పునట్టి కెమ్మోవిగలదైన యాతరుణియొక్క నగలవరుస నక్షత్రములఁ మెఱపుఁదీఁగలుంగా నున్నది. కావున ఆకాంత రాత్రియొక్క యవతార మని నేను తలంచుచున్నాను.

౬౪ ప.—ఓలిన్ = క్రమముగా. అసురమాయొ = అసురలక్ష్మియొ. అమరమాయొ = దేవలక్ష్మియొ.

వయస్యా, నీవర్ణనలచేత ఆమెను నేను తర్వాత యేలాగ ఆనవాలు పట్టగలను?

అని.—ఇదిగో ఈశిల్పముచే నెఱుంగుము.

[అని చిత్రఫలకము నిచ్చును. విదూష
కుఁడు చూచి ఆశ్చర్యపడును.

చిత్ర.—[నిర్వర్ణించి] ఆహాహా! నాప్రియసఖియే కన్నులయెదుట నగపడుచున్నది! ఏమి యీశిల్పనైపుణి! ఏమి నాచెలిభాగ్యము!

ఆ. మణియుఁ దేజుఁ, జందమామయు వెన్నెల,
వేగుతఱియు వెల్గు, విరియు వల్పు,
నెట్లొ యట్టు లెనయు నీయిర్వురం గూర్చి
బ్రహ్మ వేదజడతఁ బాసె నిపుడు. ౬౫

విదూ.—[నిశ్వసించి, ఆత్మగతము] యిటువంటి, సృష్టి వుంటుందా? [ప్రకాశము] వయస్యా, నాచపలబుద్ధిని మన్నించుమా. మరి యీమెను యథావిధిగా పెళ్లి చేసుకోరాదా?

అని.—ఎవ్వతెయో తెలియదు, మిత్రమా!

విదూ.—అయ్యో! నిజంగా నీవు అపన్నుడవే వయస్యా!

చిత్ర.—ఇరువురయవస్థయుం దూఁచినట్లు సమానముగా నున్నది!

అని.—వయస్యా,

ముదితారత్నముమోముగాంచునపు డామోమేగనంజొచ్చితిన్;
మదిరాక్షిద్యుతిఁ జూడఁజొచ్చిన నదే మాద్యద్దశన్ జూచితిన్;

౬౫ ప.—తేజు = కాంతి. వేగుతఱి = తెల్లవాఱువేళ. విరి = పుష్ప. వల్పు = పరిమళము. ఎనయు = సరిపోవునట్లు. వేదజడతన్ = వేదాభ్యాసజడుఁ డనునపకీర్తిని.

సుదతిఁ జేరడుగఁ గులంబుఁ దెలియఁగఁ సున్న య్యె నా తెల్వి; హా!
యిదిగోఁ బం డిదిగో హుళిక్కి-యని న న్నేఁ చె న్విధాత్రుండ యో.

[దక్షిణోరుస్పందము సూచించి] వయస్యా, నాకుడితొడయూరు వదరు చున్నది.

విదూ.—నీ కిప్పుడే మళ్లీ ఆజగన్మోహినితోంచు కలుగుతుంది. త్వరగా యింటికివెళ్లి నిద్రపోయి కల గను.

అని.—అంతపుణ్యమా ? అయినను బ్రాహ్మణవచనమును పరిగ్రహించితిని. [అని చిత్రఫలకమును వక్షమం దుంచుకొని కన్నులార్ధం గాంచి, యంస్వాదంబున]

(దక్షిణాంతిక.)

నవనీత సనాభి మూర్తి వై, పవిధారా పరిభావిగా మదిఁ [౬౭
సవరించితి చామ యేలొకో, వివరంబుఁ వినిపింపుమా దయఁ.

విదూ.—ఏమి యిది వయస్యా, వృత్తచిత్తరువేగదా, దీని కెందు కింత మనివి ?

అని.—అయ్యో ! చిత్తరువేనా ! హా ప్రాణేశ్వరీ! [అని మూర్ఛిల్లును.

విదూ.—వయస్యా, వయస్యా, హాహా! ఏమిచెయ్యవొచ్చును! అయ్యో చిత్తరువని నే నెందు కన్నాను! పాపాత్ముడను మృత్యువులాగ నే నెందు కొచ్చాను! [ఆలోచించి] కానీ యీవాకలోనుంచి తామరలు నీళ్లు తెచ్చి తేరుస్తా.

[అని పరుగునం బోయి తామరలు
కోయుట నభినయించును.

౬౬ ప.—మదిరాక్షీద్యుతిఁ=మాదకములైన కన్నులకాంతిని. మాద్యద్దశఁ=మత్తెక్కుచున్నవాఁడనై. సుదతిఁ=ఆయువతిని. విధాత్రుండు=బ్రహ్మ.
౬౭ ప.—చామ=ఓ యింతీ.

చిత్ర.—ఇదే సమయము. [అని యనిరుద్ధుని ఆకాశవీథికిం గొనిపోవును.

విదూ.—[శీతలోపచారోపకరణములు తెచ్చి] వయస్యా, వయస్యా, [అని కమంగడు వెదకి] యెక్కడా లేడు. [క్రింద చూచి] యీచిత్తరువు పలక యిక్కణ్ణే వుంది. [అని ఫలకముం బుచ్చుకొని] వయస్యు డేమయినా నేను వేళాకోళంగా అన్నమాటప్రకారం నిద్రపోవడానికి యింటికి వెళ్లాడేమో! అక్కడికే వెళ్లి విచారిస్తా. అక్కడ లేకపోతే యీచిత్రపుపలకని శ్రీకృష్ణులవారికి వొప్పగించి యీవృత్తాంతం వారికి విన్నపంచేస్తా.

[అని పరుగున నిష్క్రమించును.

చిత్ర.—ఈపలకముచేత ఉషాస్వరూపము శ్రీకృష్ణాదులకు తెలియ నగునుగాక, నాతిరస్కరిణిచే నితండును విదూషకునికిఁ గానరాఁడయ్యె. నా సమ్మోహినీవిద్యచే నీయన ఉషచేయి తగులువఱకు ఇట్లు మూర్ఛమున్నఁడు గానే యుండును. మహావిద్యా, మందాకినీప్రాసాదమునకుఁ గొనిపొమ్ము. [అని ఆకాశగమన మభినయించి] ఆహా విద్యాప్రభావము!

ఇఱియఁగ సుద్ద గీఁచినవహిన్ బుఱిఁజెంచెడి రిక్కమొత్తముల్,
కఱిజలదాళిలో మెఱపు గ్రాలుగతిన్ దివి నేఁ జెలంగెదన్,
బిఱబిఱ వర్షగోత్రపృథివీధరవర్గముతోడ ధాత్రియున్
వఱలు దవిష్ఠ యై తఱిమెనం గవబొంగర మున్గ్లుకైవడిన్. ఉల

---

ఉల ప.—నక్షత్రసంఘములు ఒక తిన్నని గీఱ ప్రక్క మఱియొక తిన్నని గీఱగా సుద్దతో గీఁచినట్లుగా తెల్లని తిన్న గీఱలుగా కనఁబడుచున్నవి. నల్లని మబ్బులో ఈమూలనుండి ఆమూలకు మెఱపుఁదీఁగ మెఱసినట్లు నల్లని ఆకాశములో నేను మహావేగమునం బోవుచున్నాను. భూగోళము నాకు అతిదూరమై రెండువైపులను ములికివేయఁదగిన జంటబొంగరము తిరిమెనలో తిరిగినట్లు వర్షపర్వతములతోను కులాచలములతోను గిఱగిఱం దిరుగుచున్నది.—బొంగరములో త్రాఁడుచుట్టెడు నఱదలవలె భూగోళముమీఁద పర్వతము

ఎట్టి దైవసంవిధాన మిది!

క. పువ్వువింటిసోఁకుబారికి,
జవతప్పినచెలియ కిట్టిసంజీవమణిన్
దివిఁ గేలఁ దెచ్చిరే సకు,
లెవ రేనియు నెందునేని యెన్నండేనిన్. ౬౯

ఈమణిని త్వరగా ఉషకు నిచ్చి కృతార్థనయ్యెద.

[అని నిష్క్రమించును.

తృతీయాంకము ముగిసినది.

---

లున్నతావు మిట్టగాను లేనితావు లోఁతుగాను ఉన్నవని భా. కడమ సాటిని ఆలోచించుకొన వచ్చును.

౬౯ ప.—పువ్వువింటిసోఁకు బారికిన్ = పూవిలుకాఁడనెడు పిశాచుని బాధకు. ఇట్టి సంజీవమణిన్ = ఈయనిరుద్ధునివంటి జీవనప్రదుని. దివిన్ = ఆకాశమార్గమున.

# తురీయాంకము.

---

స్థలకము [.—శోణపురి, బాణుని సభామంటపము.

కరేణుక ప్రవేశించును.

కరే.—[ఒకపండ్లపాణకను నిర్దేశించి] యీపళ్లపాణకలో దూరి వుండి నాముద్దులరాయణ్ణి, సభలో యేలాగ ఠీవిగా వుంటాడో చూస్తూ వుంటాను. నా రాయడు కూర్చునేయీకుర్చీలో వాళ్ళొచ్చేదాకా కూర్చుంటా. ఇదైతే నాకు సరిపోతుంది. నాకర్లంతా నాపక్షమే. నామీద యెవ్వరూ కొండ్యాలు చెప్పరు. [అని పెద్దయాసనమునఁ గూర్చుండి దానిని ముద్దు పెట్టుకొని] ఆయన ముందొస్తే నేను లేవకుండా గర్వంగా వుంటా.

గంభీరవేది ప్రవేశించును.

గంభీ.—యీరోజు రెండిట్లో వొకటి సిద్ధాంతం అవుతుంది. యేలాగయినా యీపెళ్లి నాకు తప్పునా యీశ్వరా! [నిర్వర్ణించి] యే మిదీ! నాకుర్చీలో గడ్డిమేటి! [వెండియు నిర్వర్ణించి] కాను కాదు, కరేణుక! కరేణుకా.

కరే.—[గర్వముగా] అక్కడ కూర్చో.

గంభీ.—మనకి ఒకరొకరికీ సరిపడే ఆసనం యిదొకటే.

కరే.—నువ్వు ముంద రొచ్చావేమీ?

గంభీ.—నువ్వు ముంద రొస్తావనే?

కరే.—ఏపెళ్లి తప్పాలని మొక్కులు మొక్కుతున్నావు?

గంభీ.—వుషకీ నాకూ.

కరే.—నీకూ నాకూ గాదు గదా.

గంభీ.—కాదు.

కరే.—అయితే ఆతలుపేశొచ్చి నన్ను కౌగిలించుకొని నాకు ముద్దియ్యి.

గంభీ.—[పోయి తలుపు వేయుట నభినయించి వచ్చి] రా మరి.

[అని యిరువురును స్థౌల్యంబుచేత చేతులు కడుపు చుట్టు రానందున ఒండొరులం గౌగిలింపలేక మాని, ముద్దిడుకొనంబూని కడుపు లడ్డపడుట చేత సాధ్యపడక ఎంతయు యత్నించి భగ్నమనోరథు లగుదురు.

కరే.—యిది మనవల్ల గాకపోతే పోనీ. యిద్దరం చెట్టాపట్టాలు పట్టుకొని నాట్యమాడదాం రా. [ఇద్దఱు ఆడుచు పాడుదురు.

(గేయము)

ఆకలైతే వెళ్లి ఆడాడ తారాడి [మాను...
మానుసులను మింగి మాయంచేతాం, మాయం...మాయం...
చూడియేనుగడొల్ల చొక్కా తొడుక్కొని
మంచు కొండకివెళ్లి మళ్లీవొత్తాం, మళ్లీ...మళ్లీ...మంచు...
నే మొగ వేసాము నీవాడ వేసాము
ఆహిరి విటకారా లారంబింతాం, ఆరం...ఆరం...ఆహిరి...
కల్లు సంద్రాన్కెళ్ళి కల్లంతా తాగేశి
ఆరే సంద్రా లని అరిచి వొత్తాం, అరిచి...అరిచి...ఆరే...
మనలోనే యేమైనా మలికిత మొత్తేను
నావేటు లన్నిట్నీ నీవేతిను, నీవే...నీవే...నావేటు...

[నేపథ్యమున మహాతూర్యధ్వనులు.]

గంభీ.—[శ్రవణ మభినయించి] అదె! ప్రభువు వస్తున్నాడు. నువ్వు పో.

కరే.—పోతాను. [అని పోణికట్టో చేరును.

గంభీ.—దీనియిల్లు బంగారం గానూ, యిదేమో యీవేళ కొంప ముంచేలాగుంది. [అని పోయి తలుపు తీయుట నభినయించును.

బాణాహ్లాదన రాజ్ఞీ కుంభాండులు ప్రవేశించి యథోచిత ముపవిష్టు లగుదురు.

యథావిభవము పరివారంబుకు ప్రవేశించును.

గంభీ.—మామగారికి నమస్కారము.

[అని బాణునికి ప్రణమిల్లును.

బాణు.—కల్యాణము. వత్సా, నీశ్రద్ధకు సంతోషము. కూర్చుండుు. ప్రేయసీ, నీయత్న మే మయినది! ఉష వివాహమున కంగీకరించినదా? ఇపుడు స్వస్థముగానేగదా యున్నది? వివాహము సేయక పెండ్లియాడు వచ్చినపిల్లను ఇంట నుంచుకొనియుండుట యవమానము గదా. పెండ్లి చేత దానికిని మనకును ఎడఁబాపు గలుగకుండ ఈగంభీరుని కిచ్చి వీనిని ఇల్లంట్ర ముంచుకొన నిశ్చయించితిని గదా. ఇంతకన్న దాని కేమిగావలయును! అంగీక రించిన సంతోషవార్త చెప్పుము ప్రేయసీ.

రాణి.—ప్రాణేశ్వరా, ఏమి సేయుదును! ఎంత బోధించినను, ఎంత బతిమాలినను, ససేమిరా యనుచున్నది. నిర్బంధించిన అది ప్రాణము విడుచును, నిశ్చయము.

బాణు.—[కోపావేశముతో] ఆ! ఆ!

గంభీ.—[ఆత్మగతము] ఈలాగైనా నాకు తప్పనుగాక! [ప్రకాశము] త్రిజగతీనాయకా, ఏల నిర్బంధము? ఉష సుఖముండుఁగాక.

(పదనము)

దూరాననేనియునుఁ గందును గన్నులార
నీరేరుహాసన యొకర్ నెన రూనదేనిఁ ;

ధారాధరాళిఁ గని సంతస మొందదొక్కొ—
నీ రియ్యకే యుఱిమినన్ శితికంఠ మూర్విన్. ౭౦

బాణు.—[క్రోధావేశముతో] అంగీకరింపదేని యిఁక నుండదు.

(వనమయూరము)

కానను దనూజ యని, కాఱియల వైతున్,
మానన నిఁక బాసటయు మాధవుఁడె గానీ ;
ఈ నిసుగు నాయెదకు నీతి యిడ సాగెన్ ;
ఏనికకుఁ దొండమున నింగిలము సొచ్చె. ౭౧

ముల్లోకముల జేతను పిల్ల సరకుగొనదఁట ! మంత్రీ, కంచుకిని రప్పించి ఉషను తెప్పింపుము.

కుంభా.—ఎవరోయి, అక్కడ? [అని యర్ధోక్తిలోనే పరికించి] దేవా, కంచుకియే వచ్చుచున్నాఁడు.

[బాణుఁడు గ్రుడ్లుఱుముచు మీసలు వడివేయును.

కంచుకి—[ప్రవేశించి యాత్మగతము] అయ్యో! నేటికాలమునకు ఎట్టిపని నాకు సంభవించినది! ఇతడులది తప్పు నాతలకు ముప్పు! నాగతి యీగడియలో నేమి కానున్నదో! నాగతి యేమైన నేమి, ఆ మంగళవిగ్రహము ఉషకా యిట్టి కీడుగలుగుట! అయ్యో! ఇందులకా నే నింతకాలము బ్రదికితిని! హా! దైవమా! హా! దైవమా! వీఁడుగో ప్రభువు.

---

౭౦ ప.—నీరేరుహానన = కమలముఖి. నెనరు = కరుణ. ధారాధర ఆళిన్ = మేఘపంక్తిని. శితికంఠము = నెమలి.

౭౧ ప.—తనూజ=కూఁతురు. కాఱియలన్=బాధలయందు. బాసట= సహాయుఁడు. నిసుఁగు=శిశువు (ఉష.) ఎదకున్ = హృదయమునకు. ఈతి = ఈతిబాధవంటి బాధను. ఇంగిలము = ఒక తెగచేఁప, అది సన్నగా జెట్టిపలె నుండును, అది కుట్టినయెడల తేలు కుట్టినట్లు విష మెక్కును.

ఎట్లు వాకొందును! హా! ప్రళయకాలరుద్రుఁడుగాఁ గనపడుచున్నాఁడు. దావాగ్నిలో శలభంబువలె పోయిపడెద. ఈతనికోపము నాతో చల్లాఱి ఉషకు అపాయము తప్పును గాక. [సమీపించి ప్రకాశము] జయము జయము జగదీశ్వరునికి! [స్వగతము] ఆచారోక్తి పలికితిని. నోట తడి లేదు. మాట రాదు. [వడవడ వణఁకుచు] జగదీశ్వరా,

బాణు.—ఏమోయి నీ తబ్బిబ్బు? నీముఖము చూడఁగా ఏమో చావువార్త తెచ్చినవానివలె నున్నావు? నిర్భాగ్యుఁడా!

కంచు.—మేము జాగ్రత్తగానే యుంటిమి! ఆమహేశ్వరునిపాదము లాన! ఏలినవారిపాదములాన; అయినను, మఱి, [అని గుటకలు మ్రింగును.

బాణు.—పాపిష్ఠుఁడా, అయినను ఏమిరా? ఏమైనను?

[అని కత్తి దూయును.

కంచు.—అమ్మాయి ఉష గర్భిణిగా నున్నది! పురుషుఁ డంతఃపురము లోనున్నట్లు తెలియుచున్నది!

బాణు.—ఏమి! ఏమీ! ఉష గర్భిణి! పురుషుఁ డంతఃపురములో! ద్రోహీ, ఇదా నీమాట! ద్రోహీ, నీవు కూర్చితివఁటరా?

[అని కత్తితో పొడువ నుంకించును. ఆహ్లాదనుఁడు కత్తిని పట్టుకొని తప్పించును. కంచుకి కృతాంజలియై వినయనమ్రుఁడునై యుండును.

గంభీ.—[ఆత్మగతము] ఇందుచేతనే పెళ్లి వొల్లనన్నది! ఆహాహా!

బాణు.—ఓహోహోహో! నాయింటనా విటకోలాహలము! ఓరీ ద్రోహులారా! [అని భద్రాసనము డిగ్గనుఱుకును. అందఱు లేతురు.

బాణు.— (స్రగ్ధర)

ధూళీపాళీకరింతున్ ధృతి హాటిఁ బడమిన్ ధూర్జటిప్రీతి గాఁగన్,
శైలవ్యూహంబులన్ తాజడిగ దెసదెసన్ జల్లెదన్ వేనవేల్గాన్,

---

శలభంబు = మిడుత.

నాలోలద్వ్యూహంబుల్ రాట్నము గొలిపి యజాండప్రజంబుల్ దెమల్తున్,
వే లంఘాచంగతన్ నిర్విధి యహరిగ నీవిశ్వమున్ బాడొనర్తున్. ౭౨

ఇదె యిపుడె దానియంతఃపురము సొచ్చి—

[అని పటపట పళ్లుకొఱుకుచు కోపావేశ మాడుచుండును.

రాణి.—అయ్యో నాపట్టీ !

ఆప్తో.—అయ్యో నాసోదరీ మంగళమూర్తీ !

గంభీ.—[ఆత్మగతము] నాతంటా తీరింది. యీగందరగోళంలో నా యదృష్టం మంచిది !

బాణ.—దానిచెలువునిం బట్టి మెడపట్టి యీతీరున నులిమెదను.

[అని గంభీరవేదిని మెడ నులుమును.

గంభీ.—కో [అని యేడ్చి] అయ్యో! అయ్యో! అమ్మ కొక్కుణ్ణి! అమ్మ కొక్కుణ్ణి.

బాణ.—దౌర్భాగ్యదూషితుఁడా, నీయవలక్షణముచేత నిట్లు సంభవించినది ! పాడుముండకొడుకా !

[అనికొట్టును. గంభీరవేది క్రింద పడి దొరలి తప్పించుకొని పోయి పరిజనము వెనుక నణఁగును. కరేణుక పాణకనుండి దొరలి పెద్దద్వారమునం బాఱిపోవును.

---

౭౨ ప.—ఈభూలోకమును ఇటునటు ఆడించుటచేతను కొట్టుటచేతను నుగ్గునూచము చేసి శివునికి ప్రీతి గలిగించెద.—(ఆయన సంహారము చేయుంవాఁడు, ఆపని నేనే చేసినచో ఆయన విశ్రాంతి పొందినవాఁడై ఆసేవకు నన్ను మెచ్చుకొను నని భా.) శైలవ్యూహంబులన్ = కొండల సమూహములను. ఝాజడి=శిలావర్షము. లోలత్ = చలించుచున్న. అజాండప్రజంబుల్ = బ్రహ్మాండ సమూహములను. లంఘాచంగతన్ = దాఁటుటయందలి నేర్పుతో. నిర్విధి=బ్రహ్మలేనిదిగాను. అహరి=విష్ణువులేనిదిగాను. విశ్వమున్=లోకమును.

బాణు.—

క. వానిని గ్రద్దల కేసెద,
దాని మహాంభోధి క్రిందితలమున దాఁతున్,
వే నాతో రండు సొరం,
గానీ దద్గేహమునకుఁ, గట్టుఁడు వానిన్. ౨౩

---

స్థలము II.—మందాకినీ ప్రాసాదము.

ఉ షా ని రు ద్ధు లు సంగీతగోష్ఠిగా ప్రవేశింతురు.

[ఆహ్లాదనాదులు స్తంభములందు లీనులై యుందురు.
బాణుఁడు నేలతలుపులను ఎత్తి అచ్చట తలసూపును.

ఉష.—ఆర్యపుత్రా, ప్రేయసిని కాంతుఁడెట్లు చూచుకొనవలయునో దానిని నీదివ్యగానమునం బాడుము.

బాణు.—[ఆత్మగతము, కోపముతో] 'ఆర్యపుత్రా!' 'ఆర్యపుత్రా!' [ఇంచుక శాంతితో] అయినను వీఁడెవఁడో మహాపురుషుఁడే.

రాణి.—[నిర్వర్ణించి] ఆహా? ఇట్టియల్లుఁడు దొరకుట మహాభాగ్యము గాదా?

ఆహ్లా.—ఏమి నాచెల్లెలిపుణ్యము! ఏమి మాపుణ్యము!

అని.—ప్రేయసీ, కాంతంగూర్చి కాంతుఁ డిట్లు నడచుకొనవలయును.

(మధురాక్కర.)

ప్రియసఖినిబోలె, శిష్యగా, గృహదీపకళికఁగాను,
దయ దొలంక వివిధ భోగ దాతృ కల్పలతఁగాను,
అయము గా నవనవర క్తి నర్థాంగలక్ష్మి నెప్డుఁ
బ్రియుఁ డఖిలజన్మసతిఁ గన్న, వే ఱింద్ర భోగ మేలా! ౨౪

---

౨౩ ప.—అంభోధి=సముద్రము. తద్గేహమునకున్=దానియింటికి.

౨౪ ప.—దాతృ=ఇచ్చునట్టి. అయము=శుభము. అర్ధాంగలక్ష్మిన్—భార్యపురుషుని దేహార్థ మని శాస్త్రము.

ఉష.—మహాప్రసాదము.

అని.—మఱి, ప్రియునియెడల ప్రేయసి యెటుండవలయునో నీముద్దు వాక్కుల నావీనులకు విందొనర్పుము.

ఉష.—ఆర్యపుత్త్రా, నా ననుఁబ్రాయిపల్కులను మన్నింపవలయుఁ.

(మధ్యాక్కర.)

కాంతునిం దనమేటిదేవుఁగా గురుంగా దొరంగాఁగ
సంతసంబె మొగానఁ దోఁప సంతానపాదపంబుగను
స్వాంతముఁ జేతలుం దాను సతన్నికై తనకుఁగాఁ గాక
కాంత రెండిండ్లకుం గీర్తి కలుగునోజను గొల్వవలయు ౭౫

అని.—ఆహాహా! ప్రియా, నీమృదువాణి వినవినం దృష్ణ హెచ్చుచున్నది!

రాణి.—[ఆత్మగతము] నాకుఁ గీర్తి తెచ్చితివి నాయనా.

బాణు.—[పైకి దుమికి ఆత్మగతము] వీనిం జూడ నామొదటికోపము మొక్కవోయినది. అయినను ఆనాసురవృత్తమును నేనొల్లను. [ప్రకాశము] ఓరీ, పట్టుడు వీనిని. [బాణపరివారము అనిరుద్ధుని చుట్టుకొనును.

బాణు.—ఎవఁడవురా నీవు!

అని.—[లేచి] నీయల్లుఁడను మామా. [అని కత్తి దూయును.

బాణు.—ఛీ! చోరా! అల్లుఁడవా మల్లుఁడవా!

[అని అనిరుద్ధుని కత్తితో వేయఁబోవును.

ఆప్త.—[ఆకత్తి పట్టుకొని] నాయనా, ఇట్టియల్లుఁడు నీకుసులభుఁడా? మహాపురుషుని సత్కరింపుము. [అని యడ్డపడును.

రాణి.—ఆర్యపుత్త్రా, ఉషను రక్షింపుము.

---

౭౫ ప.—సంతానపాదపంబు=కల్పవృక్షము — సకలము నిచ్చువాఁడు అనుట. స్వాంతము = మనస్సు. ఓజన్=విధమున.

బాణు.—[రాణిని] ఛీ! దుర్జాతా! [అని, కుమారుని గోడకు విసరి] రారా దొంగా. [అని అనిరుద్ధుని చీరుచు.

కుంభా.—[ఆత్మగతము] హా! ఈమాయి నారాయణుఁడు ఈదివ్య మంగళరూపమున నసురనాశార్థ మవతరించినాఁడు. కాన, జగడాన చావు, రాజాజ్ఞ. [అని అనిరుద్ధుని చుట్టవేసికొనును.
గంభీరవేదియుం నట్లే చేయును.

ఉష.—ఆర్యపుత్రా, నిన్నుఁ గాచుకొమ్ము, మానాయనం గావుము.

అని.—ప్రేయసీ, భయపడకు.

[అని యాయుధము పాఱవైచి, కుంభాండుని
త్రోసి, గంభీరవేదిని కడుపుపైఁ దన్నును.
ఇరువురును మూల కొకఁడు ఒఱగుదురు.

కుంభా.—[కడుపు పట్టుకొని నొప్పి సూచించుచు, ఆత్మగతము]

క. నీలోత్పలకోమల మీ
బాలునిమే నేదొ యొక్క బ్రహ్మాస్త్రమురా!

గంభీ.—[కడుపు పట్టుకొని యేడ్చుచు]

నీలాద్రి నల్ప మౌ దం
భోళికరణి వీనితన్ను ద్రుంచెనె నన్నుఁ! ౭౬

జన్మజన్మమునకు నాకు ఉష అక్కఱలేదురా బాబా!

[బాణుఁడు నాగపాశముతో అనిరుద్ధునిం గట్టి
వేయును. అనిరుద్ధుఁడు నిశ్చేష్టుఁడై పడును.

---

౭౬. ప.—ఈబాలుని దేహము నల్లగలువవలె మృదు వయినను వీని దెబ్బమాత్రము బ్రహ్మాస్త్రమువలె అప్రతిహతముగా తగులుచున్నది. పెద్దనల్ల కొండను చిన్నవజ్రాయుధము కూల్చినట్లు చిన్న వాఁడయిన వీని తన్ను నన్ను దొంగిలించినది (నాశము చేసినది).

గంభీ.—ఏమి మహాప్రభుపుమహిమ !

కుంభా.—మేఘనాదుని బ్రహ్మాస్త్రమునకు ఆంజనేయులువోలె ఇతఁడే మోహకారణవిశేషముచే ఈసర్పాస్త్రమునకుఁ గట్టువడినాఁడు. కావున మనలను నొంపవచ్చువాఁడు మఱియొకఁడు కలఁడు.

బాణు.—[కుంభాండుని, గంభీరుని లేపి] ఓరీ నిర్భాగ్యులారా, వీనిం జెఱకుం గొనిపొండు. వీనికి చండికాద్వీపములో అంధకారప్రాసాదము కారాగృహము. గంభీరా, ప్రకృతము నీవు కావలి.

గంభీ.—[నొప్పికి డొక్కపట్టుకొని] మహాప్రసాదము.

బాణు.—[మంత్రీ, ఈపిల్లకు భ్రాంతిద్వీపమున నక్షత్రప్రాసాదము కారాగృహము. [అని నిష్క్రమించును.

[కుంభాండగంభీరాదులు అనిరుద్ధుంగొని నిష్క్రమింతురు.

ఉష.—హా ! ఆర్యపుత్రా ! [అని మూర్ఛిల్లును.

రాణి.—అయ్యో, నాకట్టీ ఆశ్వసిల్లుము, ఆశ్వసిల్లుము.

[ఉష ఆశ్వసిల్లును.

రాణి.—రా అమ్మా, బయలిగాలి ప్రాణ మిచ్చును.

[అని ఉషం దోడ్కొని నిష్క్రమించును.

అష్ణా.—అహా ! ఏమి యాశ్చర్యము !

ఉ. నా యనుజాత యేమి! కుహనావిధి మ మ్మిటు కన్నొఱంగి తా
నీ యసహాయశూరుని రతీశసమానునిఁ గూడు టేమి! యే
మో యిది దేవకైతవముఁ బోలెడు;మాకిట లగ్గొ యెగ్గొ!హా!
నాయన చండ దర్ప పరిణద్ధ రణోద్ధతుఁ. డేమి సేయుదుర్!౭౭

కారాగృహము = చెఱసాల.

౭౭ క.—అనుజాత=చెల్లెలు. కుహనావిధిన్ = కపటోపాయముచేత, రతీశ=మన్మథ. దేవ కైతవము = దేవతల మాయ. లగ్గొ = మేలో. ఎగ్గొ =

క. నళినియు నభోమణియు న
రిష్టిని నొందొరుఁ గూడిమాడి మెయిమెయి నుండన్
ఫెళఫెళ నుఱుముచు మెఱుముచుఁ
బ్రళయఘనాఘనుఁడు వచ్చి ప్రళయం బొసఁగెన్. ౭౮

నేను పోయి శివదర్శనము చేసికొని మంగళాపసానము వేఁడుకొనియెదను.

[అని నిష్క్రమించును.

తురీయాంకము ముగిసినది.

---

కీడో. చండ...తుఁడు = తీవ్ర గర్వముతో కూడుకొన్న యుద్ధమునందు విజృంభించువాఁడు.

౭౮ ప.—నళిని = తామరతీఁగ. నభోమణి=సూర్యుఁడు. కూడిమాడి= కలసిమెలసి. మెయిమెయిన్ = అనుపద్రవముగా. ఘనాఘనుఁడు = వర్షించుచున్న మేఘుఁడు. కూడిమాడి = కలసిమెలసి.—నిరుపద్రవముననున్న యుంపాని దుద్దులకు బాణుఁడు చెఱుపుచేసెనని పద్య భా.

# పంచమాంకము.

## స్థలకము I. భ్రాంతిద్వీపము నక్షత్రప్రాసాదము.

### ఉష ప్రవేశించును.

ఉష.—ఎవ్వరును దృష్టిపథమున లేరు. అందఱును కనుమొఱంగి వచ్చితిని. [క్రిందికి తొంగిచూచి] క్రిందిభూమి యగపడుటయే లేదు. చిత్రలేఖకుంగూడ అక్కఱ లేనియీదుఃఖజన్మమును ఇక్కడినుండి పడి సమాప్తి నొందించెద.

క. గౌరి! నీకిదె నాకడ
సారిప్రణామంబు, వర మొసంగుము తల్లి,
వారక ప్రతిజని నా కతఁ
డే రమణుఁడు గాఁగ చిత్రయే సఖి గాఁగన్. ౭౯

[అని దుముకును.

చిత్రలేఖ ఆకాశయానమునఁ బ్రవేశించును.

చిత్ర.—

క. చూడవు పతిఁ, జూడవు సఖిఁ,
జూడవు గర్భస్థమైనసుందరమూర్తిన్;
మోడిగఁ బ్రాణసఖీ, యీ,
పాడువిధిమతంబె సిద్ధపఱిచెద వేమే! ౮౦

[అనుచు మధ్యనిలువులో పట్టుకొని మేడమీఁదికి తెచ్చియుంచి సేదదేర్చుచు]

ఆశ్వసిల్లుము సఖీ, ఆశ్వసిల్లుము.

---

౭౯ ప.—వారక=తప్పక. ప్రతి జనిన్ = ఎల్ల జన్మములందును.

౮౦ ప.—మోడిగన్=పంతముగా. విధి=నియతియొక్క.

ఆశ్వసిల్లుము=ఊఱడిల్లుము. హర్మ్యపృష్ఠము=మేడపైతలము.

ఉష.—[కన్ను దెఱచి, ఆత్మగతము] నే నెచట నున్నాను. ఉషను గదా. మందభాగ్యను గదా. మృతినై గదా పడితిని. ఇ దేమి జన్మాంతరమా? ఇది యేలోకము? [చిత్రరేఖం జూచి] ఈదేవత యెవరు? చిత్రరేఖగా నున్నది! [కలయంగని] అదే యీహర్మ్యపృష్ఠము. ఈమె నన్నుఁ గాచినది. [ప్రకాశము] చిత్రరేఖా,

చిత్ర.—ఉషా, ఏమి యిట్లు చేసితివి?

ఉష.—న న్నేల కాచితివి?

చిత్ర.—ఓసి గోలా,

క. పతి యేమి తప్పు చేసెనె?
సుతుఁ డీగర్భస్థుఁ డేమి సొం టొనరించెన్?
వెత నేమి నేను గుడిపితి?
మృతి నొక్కట మాకు మువుర కిడుటకు జెలియా! ౫౧

ఉష.—నే నేల బ్రదుకవలయును సఖీ?

చిత్ర.—ఏల యట్లు పల్కెదవు?

ఉష.—సఖీ,

సీ. ఒడిలోన నేను లేకోలగం బుండని। తండ్రికి నేఁ బగదాన నైతి,
నన్నుఁ గై సేయించి కన్నదే దినమైన। తల్లికి నే విషవల్లి నైతి,
ప్రాణంపుఁబ్రాణంబు పగిది న న్నోమెడు। నన్న కేఁ దలవంపువ్యాధి నైతి,
నను గోరి తనప్రాణమునకుఁ దెగించిన। దయితుని కే బంధదాత్రి నైతి,
తే. ప్రాణనాథుని నేఁ గొల్చి బంది నైతి,
తప్పు లేక కుశీలపతాక నైతి,
దెప్పరము మాని సకి నీవ చెప్పుమమ్మ
మాన మేఁడినవెలఁదికి బ్రాణ మేల? [అని యేడ్చును.

---

౫౨ క.—ఓలగంబు ఉండని = కొలువు తీరని. కై సేయించి = అలంకరింపించి. వల్లికిన్=తీఁగను. పగిదిన్=వలె. ఓమెడు=రక్షించెడు. దయితునికిన్

చిత్ర.—[కన్నీళ్లు తుడుచుచు] ఏడువకు చెలీ, ఏడువకు; సతీమతల్లికి నీ కేటి కీ వంత! నా జతనము నెఱవేఱియుండిన మీ కీయిడుమలు వచ్చియుండవు. [ఉష యేడ్పు మాని నిట్టూర్పు పుచ్చును.

చిత్ర.—[ఉషాహృదయముం దాఁకి] సఖీ, నీగుండియ లింకను అదరుచున్నవి. సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము.

ఉష.—ఈమందభాగ్యకై నీపడిన క్లేశమును చెప్పుము. నీ సుచరిత్రము నా దౌర్భాగ్యము నడంచి సమాధి నొసంగును.

చిత్ర.—నాఁడు నీమీఁద మీనాయన యేమి యుద్యమించునో యెఱుఁగఁగోరి తత్సభలో నదృశ్యకరణినై యుంటిని. ప్రకృత మెఱింగితిని. వారు మీకడకు రాకమున్నె మి మ్మిరువురను ద్వారకం జేర్ప దలంపుగొని మీ కడకు మెఱపువడిని వచ్చుచుంటిని.

ఉష.—మఱి యేల యట్లు కొనిపోవైతివి సఖీ?

చిత్ర.—దారిలో నారదులవారు వారించిరి.

ఉష.—హా! ఎంతటి పాపాత్మురాలను! ఆ లోకైకకుటుంబికి సయితము అననుకంపనీయనైతిని!

ఆ. దేవమౌని యహహా! దీనమందారుండు,
జాలి వెట్టె నాకు జాలి లేక;
నిఖిలలోకులకును నీరిచ్చు మేఘుండు,
పిడుగువైచు భాగ్యవియుతుమీఁద. ౮3

---

=ప్రాణనాథునికి. బంధదాత్రిక్=చెఱ గలిగించినదానను. బందిక్ = ఖయిదిని. కుశీలపతాకక్=చెడునడతకు జెండాను. ఏడిన=పోయిన.

అదృశ్యకరణి=ఒరుల కగపడకుండుటకు సాధనమైన విద్య.

౮3 ప.—దీనమందారుండు = దీనులపాలిటి కల్పవృక్షము. జాలి = దుఃఖమును. జాలి=కనికరము. వియుతుక్=హీనుని.

చెడ్డకాలమున మంచివారికింగూడ ద్వేషము కలుగును

చిత్ర.—నీశ్రేయోవిశేషమునకై వారట్లు చేసిరి.

ఉష.—నాకును శ్రేయమా?

చిత్ర.—నీకడుపులోని మహాపురుషుని శిశురూపలాలితుని నీప్రాణనాథునికి కానుక యిచ్చుభాగ్యము ఎవరిది?

ఉష.—అంతభాగ్యమా?

చిత్ర.—అంతకన్న వేయిమడుంగులు. మఱి యిట్టి దారుణారంభములు సేయ నని నాకు మాట యిమ్ము.

ఉష.—నీవు దివ్యప్రభావవు. నేఁడు నాప్రాణేశ్వరుని నాకు చూపుదువేని, మాట యిచ్చెద. చూపనిచో, నాబుద్ధి నాది గాదు.

చిత్ర.—రారమ్ము. నాఁ డతనిని నీకుం దెచ్చితిని. నేఁడు ని న్నతనికిఁ గొనిపోవచ్చితిని. [అని ఆకాశయానమున ఉషం గొనిపోవును.

---

స్థలము II.—ఆకాశము.

ఉష.—సఖీ, ఈయాకాశగమనము నాకుఁ గడువింతగా నున్నది. సఖీ, నాతప్పులు మన్నింపుము. నిన్ను బ్రహ్మ నాకై చేసినాఁడు ప్రాణసఖీ, నా ప్రాణేశ్వరులు ఎట్లు ఆరగింతురో, ఎట్లు నిద్రింతురో, ఎట్లెట్లు కాలము పుత్తురో చెప్పఁగలవా?

చిత్ర.—తెలియదా?

ఆ. నిన్నుఁ బాసినట్టివన్నె కానికి నెట్లు
 కన్నుఁగవకు నిదుర గల్గునమ్మ?
 ఆరగించు టొక్కయభినయం బవుఁ జూమీ;
 క్షణము యుగ మటంచుఁ గనఁగ లేవా? ౦౪

---

గంతవ్య = పోవలసిన. ప్రాసాద పృష్ఠమునన్ = మేడపై తలమున. దీప్తి = కాంతి.

ఉష.—[నిశ్వసించి] ఎంతదారుణచిత్తను చెలీ !

---

స్థలకము III.—చండికాద్వీపము, అంధకారప్రాసాదపృష్ఠము.

చిత్ర.—గంతవ్యదేశమునకు వచ్చితిమి. ఆహా ! ఏమిమంచిసమయము ! చూడుము. ఇతఁడే నీప్రాణవల్లభుఁడు ప్రాసాదపృష్ఠమునం బరుండి యున్నాఁడు.

ఉష.—ఔనౌను, దీప్తిచేతనేగాని ఆకృతిచేఁ దెలియరాకున్నాఁడు సఖీ.

చిత్ర.—నీకృత్య మెంతదారుణమో యితనిభాషితముల నెఱింగెదవు లే. ఈతరుశిఖరమందు ఈపట్టంపుటాకుబేబులో నిలిచి పరికింతము రమ్ము.

[అట్లుచేయుదురు.

అనిరుద్ధుఁడు యథానిర్దిష్టుఁడు ప్రవేశించును.

అని.—[దిగ్గనలేచి కూర్చుండి ఊర్ధ్వము సూచి] ఆహా ! నాకొకసాధనముదొరకినది !

ఆ. కప్పుమాల్మికాఁడ ఖండేందుతరి నెక్కి
వెల్గుఁదెడ్లు వయిచి విన్ను వాఁక
నురవణింతు వహావ ! యుదిరి కే విచ్చెదఁ,
జెలియ యుండు రేవుఁ జేర్పు నన్ను. రాగి

హా ! లక్ష్య పెట్టఁడు గదా నిశాచరుఁడు ! ఓయి ద్విజరాజా,

---

రాగి వ.—చంద్రునిలోని నల్లనిభాగ మనెడి యోమాలిమీ, చంద్రరేఖ యనెడిపడవనెక్కి కిరణము లనెడి తెడ్లు వైచి ఆకాశ మనెడి యేటిలో వడివడిగా జరుగుచున్నావే; ఆశ్చర్యముగా నున్నది ! నీకు బంగారము కేవుగా నిచ్చెదను ! నన్ను నీ పడవలో ఎక్కించుకొని నాప్రాణేశ్వరి యుండు రేవునకుం గొనిపొమ్ము.

నిశాచరుఁడు=చంద్రుఁడు—రాక్షసుఁడు క్రూరుఁడు నసియుం భా.

ఆ. రెండు కరములందు రెండు చేతులు వట్టి
యుషను వీచి నాకు నొసఁగవయ్య ;
అట్లు సేయవేని యట్లె నన్నె యెత్తి
యుష కొసంగి సుకృత మొందవయ్య. ౮౬

ఏమియుం జేయవా ? కాలకూటసహోదరుఁడవుగదా.

ఉష —సన్నిహితను నన్నెఱుంగక యెంత తపించుచున్నాఁడే ఆర్యపుత్త్రుఁడు. చంద్రునిచేఁ జక్రవాకముల కగుగతి దైవమూచేత మా కయినది ?
[ఉఱుము !

అని —[ఊర్ధ్వ మరసి] ఓయి మేఘుఁడా, నీవుపకరించెద ననుదువా ? అట్లేని ?

ఆ పతపతా యటంచుఁ బవి మ్రోఁగ భీరువు
లులికి తావుదప్పు టుర్వి నిజము,
అట్టె యుఱిమి నీవు ననఘాత్మ యురలింపు
ముషను నాదు పేరు టురమునకును. [ఉఱుము.

అని.—ఏమి ? ఉషను గుర్తెఱుఁగ నందువా ?

క. ఏయువిద మేనిమ్రోఁిలను
నీయబల తటిన్మతల్లి నిగుఱు గవిసి య
ట్లే యున్న దావ హాత తరు
వో యనఁ జూపట్టు, నదియె యుష సుమ్ము సఖా. ౮౮

౮౬ ప.—కరములందు=నీచేతులందు. వీచి=విసరి. సుకృతము=పుణ్యము. సన్నిహితను=చెంతనున్న దానిని.

౮౭ ప.—పవి = ఇంద్రునివజ్రాయుధము - పిడుగనుట. భీరువులు= పిఱికివారు-స్త్రీలు. ఉర్విక్ =భూమిలో. ఉరలింపుము=దొరలింపుము.

౮౮ ప.—ఏదే నొకచెట్టుదావాగ్నికి మండిపోయి నిగుఱు గప్పి వేలకుం

ఉష.—చెలీ, ఆర్యపుత్త్రుని యీపరిదేవనమును నేనెట్లు సహింతును!

అని.—నీయువిదను డించుపఱిచినందులకు నీవు అలిగెదవా? అయ్యా జీమూతా, మఱి యేమియుం జేయవేని,

ఆ. ధరణి నెల్లవారు దాత యందురు నిన్ను,
నొక్కకోర్కె నాకు నొసఁగవయ్య,
పుడమికెల్ల నమృతపూరంబు వర్షించి,
పిడుగు నొకటి నాకు విసరవయ్య. ౮౯

ఉష.—అయ్యో చెలీ, ఈవీను లేమి వినుచున్నవి! [ఉఱుము.

చిత్ర.—ఉఱుము పెటపెటకు ఉలిక్కిపడిన చిలుకగా పోయి యీ ముత్యాలహారమును నీమనోవల్లభుని కిచ్చి తత్క్షణమే రమ్ము. ఇదె నిన్ను మార్చితిని.

[ఉష చిలుక యైనది. పెటపెట ఉఱుము హారముతో చిలుక అనిరుద్ధునిమీఁద వ్రాలును.

అని.—ఆహా! వారిదా, మహోపకారీ, ఇదె నీపిడుగును గ్రహించెద. జన్మజన్మములకును కృతజ్ఞుఁడను. [అని చిలుకను సహారము నెదం గొని, సుఖస్పర్శ మభినయించి, పరికించి] ఏమి యిది పిడుగు గాదు, సహారము శుకరాజము. ఆహా! ఏమి దైవవంచన! ఆహా! ఇదేమి వింత!

తే. పసరుఁబట్టుఱవికజగ్గు పరిధవిల్ల
నరిదితాఁకుడుచేత మోహమున ముంచు
స్తనయుగముతోడిభామవక్షంబుఁ బోలి
చిత్తమున కెక్కు నీముద్దుఁజిల్క యక్కు. ౯౦

---

గూలక అట్లే నిలిచియున్న నెట్లు కళాహీనముగా నుండునో, అట్లు నీభార్యయగు మెఱపుఁదీఁగ నాప్రియతమ యగు నుష మోవిల కాంతిహీనమై వెలవెలఁబోవుచుండును, ఆగుర్తుఁబట్టి ఉషను తెలిసికోవయ్యా ఓమిత్త్రుఁడా.

౯౦ ప.—అక్కు=పక్షము.

దీనితో హారమేమి? ఇది యెవరిదో బుద్ధిమంతులది పంజరపుఁ జిలుక. తప్పించుకొని వచ్చి తరువాత మలవాటులేమి ఉఱుమున తలికి యిటం బడినది, దీనిం దేర్చెద. [అనియెత్తి యక్కున నిడికొని ముద్దుగొని యుపలాలించుచు] ఆహాహా!

ఉ. మాటలు నేర్పి శిష్యువలె, మాటికిఁ బం డ్లిడి బిడ్డకైవడిన్,
మేటికుచాద్రులన్ నిలిపి మెచ్చుచు ముద్దిడి కాంతునింబలెన్;
గాటపుఁగూర్మిఁ జెల్లెలినిగాఁ జెలువల్ చెయిపీడ కున్ననున్,
రాలె యొసంగెనో చిలుకరాణిరొ నీకును బంధనక్రియల్?

ఆహా! ఇట్టి హారమునే మన్నామాంకితమును ప్రియూషకోరుహాముల నేనలంకరణ ముంచితిని [మెఱుము.] ఈ మెఱుమునం దెలిపినది, అదే యీహారము మేఘభవమాల్తికముల రచించినది, విద్యాధర చక్రవర్తి మాతాతకు కానుకయిడినది. [మెఱుము.] ఇవి యేమి యీయక్షరములు. [చదువుట నభినయించి] 'ఉష'! ఆహాహా!

[అని ఆనందజడుఁడై మూర్ఛిల్లును. చిలుక కలకలం గూయుచు ఱెక్కల నతనివీచును. అనిరుద్ధుఁడు తేరును. చిలుక అనిరుద్ధుని కెరఁగి యెగిరిపోయి చిత్రకడ నుపాకృతిం దాల్చి నిలుచును.

అని.—[చిలుక పోయినవలను సూచుచు] ఏమి యీమాయ! ప్రియ దీనింబంపినదా నా ప్రాణములు నిలుపుటకు? నాయుపలాలనంబుల నింకనింకఁ గోరినకైవడి నిది నాకు వశంవదయై యుండినది. నాప్రియయే యిది. సందేహము లేదు. అయ్యో! వచ్చియుం ప్రియ యిట్లు క్షణదృష్టనష్ట గావలయునా! హా! చిలుక యయ్యును పలుకదాయెఁగదా! హా ప్రేయసీ!

---

బుద్ధిమంతులది=సిరిగలవారిది.

౯౧ ప.—మేటికుచాద్రులన్ = గొప్పచనుఁగొండలమీద. రాలె = ఆయాసమునే.

ఉష.—సఖీ, ఒక్కమాటకేని నెఱవీయ వయితివే!

చిత్ర.—అనియమితేంద్రియులకు ఆసన్న శుభములును దూరము లగును.

అని.—ఇట్లనుగృహీతునికి మరణాశంస యేల! వెండియు ఇట్టి యీ సమాగమమేని దైవ మొసంగదా! ఈమాఱు వచ్చినప్పుడు,

క. ఒక్కుమ్మడి ముద్దులజడిఁ
జిక్కువఱచి మఱపి పల్కఁజేసెదఁ జిల్కన్;
అక్కజపున్బిగికౌఁగిట,
నుక్కిరిబిక్కిరిగ నొక్కి యుషఁ గావింతున్. ౯౨

చిత్ర.—సఖీ, వినుచున్నావా?

ఉష.—[ఆనందబాష్పములతో] ఇంక దారుణారంభములు సేయను.

అని.—ఇపుడె పిడుగుం గోరితిని, ఇపుడె చిరాయువుం గోరుచున్నాను. ఏమివింత ప్రపంచ మిది? స్వప్నమా! ఇంద్రజాలమా! [ఊఱుము.] మేఘదేవా, కాదు వాస్తవమనుచున్నావా? నీవు ప్రాణులయాంతర మెఱుఁగుదువు గదా. [ఊఱుము.]

పురుషుఁడు.—[ప్రవేశించి] మహాప్రభూ, ప్రబలవర్షము వచ్చుచున్నది. దేవరవారు లోపల శయన మంగీకరింపఁదగును.

అని.—[ఆత్మగతము] ఆ! ఈచోటు విడువఁ జాల. కానిమ్ము, వెండియు వచ్చెదంగాక.

[అని లేచి ఆచెట్టును నిర్వర్ణించును. ఉసిరికచినుకులు రాలును.

అని.—వెండియు ప్రియాసమాగమ మగునందాఁక ఈహారము నాకు జీవగఱ్ఱ. ఓహారమా,

---

౯౨ ప.—ఒక్కుమ్మడిన్ = ఒక్కమాఱుగా. ముద్దులజడిన్=జడివాన కొట్టినట్లు ఎడ తెఱపి లేకుండ ముద్దులుపెట్టుకొని. అక్కజపు = ఆశ్చర్యకరమయిన.

తే. నాయెడను మున్ను నీ విట్టినయ మెఱుఁగవు,
మెలఁత చనుగట్లతోఁ గొంత మెలఁగినంత
విరహితుని కిట్లు సంజీవకరణి వైతి;
వున్నతులతోడిసంగడి పన్నె యిడదె? ౬౩

అని నిష్క్రమించును.

ఉష.—హా! నేనెంతదారుణహృదయను!

చిత్ర.—నెచ్చెలీ, చూడు నీదయితుని యుపచారములు.

ఉష.—ఎంతకాలు మార్యపుత్త్రునికి ఈపరోపచారక్లేశము?

చిత్ర.—తాతకు ఈతనిపై తలఁపు గలుగుపఱకు; నీతావునకుం బోయి యీ యాపన్నశరణ్యు నుపాసింపుము.

ఉష.—నీయాజ్ఞ.

చిత్ర.—మఱి పోదము పద.

ఉష.—ఆర్యపుత్త్రుని వదలిరా నాకా ళ్లాడకున్నవి.

చిత్ర.—మనలను వెదకకముందే పోయి చేరవలయును.

ఉష.—అట నన్ను విడనాడవుగదా?

చిత్ర.—ఆమాట నీనాథుని నీవు గలయుందాఁక నేగదా?

ఉష.—అది గల్గునా?

చిత్ర.—తప్పక, త్వరలో. తడసితిమి. మన కిపుడు క్షణ మొకనిధి. ఈకార్యాయిఖులకుం దొలఁగి పైమార్గమునం బోవుదము. రా రమ్ము. ఆర్త త్రాణపరాయణుం శ్రీకృష్ణుం బాడుచుం బోదము.

ఉష.—నీశిష్యను.

ఇరువురు.—[యానమభినయించుచు]

---

౬౩ ప.—నయము=నేర్పు. ఉన్నతులతోడి=గొప్పవారితో నైన (తుంగము లయిన వానితో నని సూచకరము). సంగడి = సహవాసము.

(తరువోజ)

కావవో పాంచాలిఁ గరుణాసముద్ర ?
కావవో మునిరాజు కాంత నహల్యఁ ?
గావవో కపిరాజుఁ ? గావవో కరిని ?
గావవో ప్రణతు లంకాపతియనుజుఁ ?
గావవో ప్రహ్లాదుఁ ? గావవో ధ్రువునిఁ ?
గావవో కుబ్జను ? గావవో పసులఁ ?
గావవేల త్వదేకగతుల నీమ్ముఁ ?
గావు కావుము రమాకాంతాకళత్ర. ౯౨

[అని నిష్క్రమింతురు.

పంచమాంకము ముగిసినది.

---

పాంచాలిన్ = ద్రౌపదిని. మునిరాజు = గౌతమునివారి. కపిరాజున్ = సుగ్రీవుని. కరిన్ = గజేంద్రుని. లంకాపతియనుజున్ = విభీషణుని. త్వదేకగతులన్ = నీ వొక్కఁడవే గతిగాఁ గలవారిని (నిన్నే నమ్ముకొనియున్నవారిని). రమాకాంతాకళత్రా = లక్ష్మీరమణి భార్యగాఁ గలవాఁడా.

# ప్ర వే శ క ము.

---

స్థలకము:—ద్వారక, శ్రీకృష్ణప్రాసాదోద్యానము.

బం భ రి కా కీ ర వా ణు లు ప్రవేశింతురు.

బంభ.—[ఊర్ధ్వము చూచి] వోశేవోశే, కీరవాణీ. చూడు చూడు ఆజ్యోతిని. [ఇరువురును ఊర్ధ్వము పరికింతురు.

బంభ.—ఏమిటే ఆజ్యోతి? నగర్లోనుంచి వుత్తరంగా వెళ్లి మాయమైంది!

కీర.—యిందాక యిది నగర్లోకి వెళ్లింది. మఱి యిదేమిటో తెలవ లేదు. అల్లదుగో నాడాయనయ్య నగరికాణ్ణుంచే యేమో గొణుక్కుంటూ వొస్తున్నాడు. ఆయన్నడుగుదాం:

వి దూ ష కుఁ డు యథానిర్దిష్టుఁడు ప్రవేశించును.

విదూ.—[తనలో తాను నవ్వుకొనుచు] అప్పుడు నేను సభా మందిరంలో తగిలించిన పఠం యిప్పుడు పనికొచ్చింది. ఆహాహా!

కీర.—యేమిటయ్యో నాడాయనయ్యా, అంతా నీలో నువ్వే! వెఱ్ఱెత్తిందా అయ్యవారా?

విదూ.—సంతోషం సంతోషం. ఈరోజు 'ఆనంద మానంద మాయనే.'

బంభ.—ఏమి సంతోసమయ్యా, మాక్కొంచం చెప్పవయ్యా, మేమూ కొంచం నవ్వుతాం.

విదూ.—హెహెహెహె [అని నవ్వి] మీతో ఎందుకూ చెప్పడం?

బంభ.—అయితే దాచుకోవయ్యా.

కీర.—వేళాకోళం చెయ్యక చెప్పవయ్యా. ఆవెల్తు రేమిటో రొండు తూర్లు అవుపడ్డది.

విదూ.—నారదబ్బ మహాముని.

[అని గడ్డము దువ్వుచు టింగ్టింగని వీణవాయించుట ననుకరించును.

ఇరువురు.—[ఆశ్చర్యపడుచు, నవ్వి] నిజ్జేమో నిశ్చయమే బాపనయ్యకి.

కీర.—అనిరుద్ధమహారాజుసంగతి యేమైనా తెలిసిందా నాడాయ నయ్యా ?

విదూ.—సెప్తా పట్టు. అనిరుద్ధమహారాజు బాణాసురుడికి పట్టుపడి అ దేదో ఒకద్వీపంలో, దానిపేరు మరచిపోయినా, బందిఖానాలో వున్నాడట.

[ఇరువురు ఆశ్చర్యపడుచు విందురు.

విదూ.—నేను సభలో వేలగట్టిన పఠం బాణాసురుడి కూతురట, వుష గారట. మరేమునికీ తెలిసిందిగాదుగాని యీముని యిక్కడా అక్కడా కూడా తంటాలోడు గనక యీనారదబ్బమునికి తెలిసింది, ఆమెనికూడా తండ్రి ఒక ద్వీపాంతరంలో ఖైదుచేశాడట, కృష్ణమహరాజు రుక్మిణయ్యగారూ మనమణ్ణి మనమరాల్ని తీసుకొని రావడానికోసం యిప్పుడే గరుడయ్యనెక్కి బాణాసురుడిమీదికి ప్రయాణం. సాయంత్రంలోపల అనిరుద్ధమహారాజునీ ఆయనభార్యనీ చూస్తాం నేడే గృహప్రవేశం. అప్పుడే నగరాలంకారానికి కూడా ఆజ్ఞ అయింది; రేపు మేమంతా ప్రస్థానప్పళాలు క్రొట్టడం, మీ రంతా యెంగిలాకులెత్తడం. "ఆనంద మానంద మాయెనే !"

[అని చంకలు గ్రుద్దుకొనును.

కీర.—అమ్మయ్యా ! యెంతపుణ్ణెమే ! [అని బంభరికను కౌఁగిలించును.

విదూ.—లంజకూతురా, నేను శుభవార్త చెపితే నువ్వు దాన్ని కౌగి లించుకొంటావేమీ ? [అని కీరవాణిమీఁదికి ఎగురును.

కీర.—జంజ మట్టుకొని లాగే, చెడిబదికినబాపడు ముసుదాడు లాగిన యెద్దులాగ లొంగుతాడు.

విదూ.—లంజకూతుళ్లారా, నే నేమీ లాగలేనా, నే నేమీ లాగలేనా?

[అని ఒక తెను మార్చి ఒక తెను తఱుమును.

కీర.—వోలే ఆపాడుబాపడికాణ్ణుంచి యెల్లే !

[అని యిరువురు పలాయిత లగుదురు.

విదూ.—ఆబాణుడు వాళ్లిద్దర్ని కలా వొక కోటలో పెడితే, నేను మిమ్మల్నిద్దర్ని కలా వొక తోటలో పెట్టలేనా? లంజాకోరా!

[అని వెంటఁబడును. అందఱును నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

# షష్ఠాంకము.

---

స్థలకము:—శోణపురి, బాణసభామంటపము.

బాణాహ్లాదనకుంభాండగంభీరవేదులు ఉపవిష్టులై ప్రవేశింతురు.

బాణు.—మంత్రిసత్తమా, ఈకన్యాంతఃపురద్రోహి యెవఁడో కనుంగొననేరవుగదా.

కుంభా.—దేవా, ఇతఁడు అసురుఁడుకాఁడు, అమరుఁడునుం గాఁడు. ఇతఁ డెవరో మహాప్రభావుఁడు మర్త్యుఁడే గావలయును.

బాణు.—[పండ్లు కొఱుకుచు] మహాప్రభావుఁడేమోయి! నీ కేమేని బట్టుమాన్య మిచ్చినాఁడా? నిన్ను త్రోసినత్రోపునకే మహాప్రభావుఁడా? ఆమాట వెండియు నాచెవిని వేసితివేని వానిని మాని వానిదండన నీకు విధించెద. నీబోఁటిపందలకు అందఱును మహాప్రభావులే.

కుంభా.—అపరాధిని, మన్నింపవలయును.

బాణు.—మఱి మర్త్యుఁడేని మనరాక్షసులచే భక్షింపింతమా?

ఆహ్లా.—మీనరఖాదనులకునైతము అట్టిసుకుమారసుందరమూర్తిని గోట మీటనేనియు మనసు వచ్చునా!

బాణు.—వేశ్యాభ్రాతవుగా నీచెల్లెలికి తగిన సరసుఁ డని తెచ్చితివా?

ఆహ్లా.—అప్పు డతఁడు నాచెల్లెలిపల్కుమంత్రమునకుం గట్టువడఁడేని తమనాగపాశమునకుఁ గట్టువడలే దని తలంపుఁడు.

బాణు.—కాదురా, మూర్ఖా, నీమీఁదికకారముఖదాక్షిణ్యమునకుఁ గట్టువడినాఁడురా.

---

అమరుఁడు=దేవత. మర్త్యుఁడు=మనుష్యుఁడు. నరఖాదనులకు=మనుష్యభోజనులకు. కకారుఁ డనఁగా రాజు ఉంచుకొన్నదాని సహోదరుఁడు.

గంభీ.—[ఏడుపు మొగముతో డొక్క చూపుచు] అప్పుడు వాఁడు తన్నినతన్ను నాకీక నీజన్మములో కుదుకునది గాదు.

బాణ.—ఛీ! నిర్భాగ్యుఁడా! పందమొగము చూపుదువా నాకు! [అని కత్తియెత్తి] పో నాప్రాణ లుండవు.

[అని కొట్టఁబోవును. గంభీరవేది ఏడుపు మొగ ముతో తలఁగి దూరమునఁ గూర్చుండును.

బాణ.—మఱి, చండికి వానిని బలివేయవలసినది.

అష్ట.—అసురకులక్షయకారికృత్య మిది. మఱి, మీకు శక్యము గానేరదు.

బాణ.—ఎక్కడ నేర్చితివిరా యీనీతులు; మూర్ఖా!

[అని కత్తి దూయును. కుంభాండుఁడు కత్తి పట్టి ఆఁపును.

[నేపథ్యమున మహాకలకలము.]

[ప్రచండవాతము.]

పతాకాధికృతుఁడు.—[సంభ్రాంతుఁడై ప్రవేశించి] జయము జయము ఏలినవారికి. పతాకాధికృతుఁడను. లోకాలోకేశ్వరా, ధ్వజము విఱిగిపోయినది! ఉత్పాతవాతము కొట్టినది! చెట్లన్నియుం విఱిగి వీథుల కడ్డముగా పడినవి! మేడలు కూలినవి! అగ్నిప్రాకారము ఆఱిపోయి, రోదసీకుహరమెల్ల పొగనిండినది! ఎఱ్ఱధూళి లేచి పట్టణమంతయుం దూరమునకు మండుచున్నట్లగపడుచున్నది! ఊపిరి తిరుగదు! ధూళిచీఁకటిచేతను పొగచీఁకటిచేతను ఎవనియొడలు వాని కగపడుట లేదు! ఊరంతయుం ఇక్కడిదక్కడ అక్కడిది క్కడ! గుర్తు పోయినది. ఇందులో సుడిగాడ్పు! నేను సంభ్రాంతుఁడనై ధ్వజముం గౌఁగిలించుకొంటిని. అది పతాలున అక్కడ విఱిగి యిక్కడ సింహద్వారమునఁ బడినది. నేనును దానితో నిట పడి చావు తప్పి యిందికి తూలితిని. అటుపైన యేలినవారిచిత్తము.

---

పతాకా=ధ్వజ. రోదసీకుహరము=భూమ్యాకాశమధ్యప్రదేశము.

[అందఱును సంభ్రాంతు లగుదురు.

కుంభా.—[ఆత్మగతము] అయ్యో అపశకునము!

బాణు.—[స్మరణ మభినయించి] అహో! భాగ్యము! ఈదినము నాబాహుల కండూతి వాయును. మంత్రివరా, పోయి క్షణములో యుద్ధ సన్నాహ మొనర్పుము. ముందుగా సింద్రాదులను బంది నంపుము. ఓరీ టెక్కెముగా, నీపని చూచుకొమ్ము.

పతా.—[ఆత్మగతము] టెక్కెము విఱిగినది. ఇంక నాపని యే మున్నది చూచుకొనుటకు!

కుంభా.—
పతా.—
} జీవరయాజ్ఞ. [అని నిష్క్రమింతురు.

బాణు.—[స్వగతము] ఎవరు నిర్మించియుండు రీయుత్పాతమును?

[నేపథ్యమున]

(స్రగ్ధర)

చక్షుర్యుగ్మంబు నృత్యత్క్షణరుచి శుచిభాస్వద్ధ్వయాంబుద్ధిఁ గొల్పన్,
పక్షద్వంద్వంబు సాంధ్యప్రథమచరమదిగ్భాగవిభ్రాంతి సేయన్,
రూక్షత్రోటీపునర్భూరుపురుమణిసంరూపి తేంద్రాయుధద్ధిణాం
బక్షీంద్రుం డద్దిరా యభ్రమున గళగుహావ్యాప్తవిశ్వుండు పొల్చున్.

అహో—గరుడపక్షవాతము నాయనా ద్వారకనుండి తరలినమాత్రాన తమ మయూరధ్వజముం గూల్చినది.

---

గాగి ప.—రెండుకన్నులును నర్తించుచున్న మెఱపుఁదీఁగలతోఁ గూడు కొన్న యిద్దఱు వేసవిసూర్యుల నెడి భ్రమను పుట్టించుచుండఁగా, రెండు ఱెక్కలును సంధ్యాకాలములయందలి తూర్పుపడమర లనెడిభ్రమను కలిగించు చుండఁగా, కఠోరము లయినగోళ్లను ముక్కు ననెడి వజ్రనిర్మితేంద్రాయుధముల సమృద్ధితో, గరుత్మంతుఁడు ఆహా లోకమంతయుం ఇముడునంతటి గుహావంటి నోరు దెఱచుకొని ఆకాశమున వచ్చుచున్నాఁడు.

బాణు.—కానీ; గరుడునికి పక్షవాత మొసంగెద.

[నేపథ్యమున ప్రచండశంఖధ్వని.]

బాణు.—ఛీ! ఏమి యీపాడుధ్వని!

[గంభీరవేది యులికి వెదకిలంబడి తన్నుకొనును.

[నేపథ్యమున]

(పంచచామరము)

నభంబు వ్రీల, మేరురోమహాణంబు లుర్ల, నాగలో
కభూము లట్టె వ్రయ్య, సప్తకంధు లింకఁ, గుక్షిలో
గుభి ల్గుభి ల్గుభి ల్మటంచు గోట్టుకిద్దుగొల్పుగా
భభాం ఢఢా మటంచు మ్రోగెఁ బాంచజన్య మద్దిరా. ౯౬

బాణు.—ఈ నిర్భాగ్యుఁడు కుంభాండుఁడు సేయుచున్న యుద్ధ సన్నాహము ఈ బట్టుపొగడికయే గావలయు!

[గంభీరవేది ఆవర్ణనకు మఱియు నుబికి తన్నుకొనును.

బాణు.—[వీక్షించి] వీని కేమి రోగము?

ఆప్తు.—పాంచజన్యజ్వరము. వీఁడే గదా నాయనా తమరు కోరుకొన్న యల్లుఁడు!

బాణు.—ముం దీపాపిష్ఠుని పరిమార్చెద.

[అని లేవ నుంకించును. గంభీరవేది పరువున నిష్క్రమించును.

కోవురమునాయకుఁడు.—[సంభ్రాంతుఁడై ప్రవేశించి] జయము జయము ఏలిన వారికి. లోకనాయకా, కోవురమునాయకుఁడను. గరుడారూఢుఁడు సభార్యుఁడు కృష్ణుఁడు వచ్చియున్నాఁడు, ద్వారకావాసి.

బాణు.—[ఆలోచించి] అస్మత్కులైకవిద్వేషి యాదవపటువు మా వరప్రకాశములకు భీతిల్లి మాపాదములు గొలువ వచ్చినాఁడా?

---

పక్ష వాతము = ఱెక్కలగాలి (ఱెక్కలకు వాత వ్యాధి.)

కోపు.—మహాప్రభూ, ఆకాశమునుండియే యిట్లు నాతోఁ బలికినాఁడు :—

బాణు.—ఏమని ?

కోపు.—"మామనుమని ఆతనిభార్యను చెఱనుంచినాఁడట— [అని యర్ధోక్తిలో] లోకేశ్వరా, ఆయనమాట వలెనే ఆవేగమున నానోట వచ్చినది. మన్నింపవలయును. దేవా. [అని నేల వ్రాలును.

బాణు.—వానిమాటగానే చెప్పు.

కోపు.—దేవరయాజ్ఞ. "చెఱ నుంచినాఁడట బాణుఁడు, వారిని తెచ్చి యీక్షణమ మాకడ నిడుటయో, మాతోఁ బోరి యమసదనంబునం బడుటయో, రెంట నొక్కటి ఏకక్షణమ నిశ్చయించుకొమ్మను బాణుని." అని పలికినాఁడు.

బాణు.—ఏమీ! ఈమాదవపటువునహంకారముద్ర! [తలయూఁచి] వీనిమనుమఁడా వాఁడు! ఇదె యుత్తరము ;—

క. చండికి వానిని బలి యిడ
నుండితి ; నిన్నతనిదుఃఖ మొందక యుండన్
ఖండించి నీశిరమె మును
ఖండేందువతంసుసతికిఁ గానిక యిడెదన్. ౯౭

ఇట్లని మామాటగాఁ జెప్పుము.

కోపు.—దేవరయాజ్ఞ. [అని నిష్క్రమించును.

బాణు.—శయ్యమునకు వీనికి స్త్రీ యేల? ఆఁడుదానిపాటి వీఁడు పోరలేఁడా ?

---

ఆవేగమునన్ = తొట్రుపాటుచేత. సదనంబు = ఇల్లు.

౯౭ ప.—ఖండేందువసంతుసతికిన్ = చంద్రరేఖను శిరమునఁ దాల్చువాఁడగు శివునిభార్యకు చండికి.

ఆహ్లా.—తమబాహుకండూతి యడంప నాతండును, మనుమరాలిని గృహప్రవేశార్థము కొనిపోవ నామెయు, వచ్చినారు నాయనా. నేఁడసుర కులమునకు వారివలన శరణమంగళమో మరణమంగళమో రెంట నొకటి తప్పదు.

బాణు.—పందా, శరణమంగళ మేమిరా! ఇదె నీతో చండికి మూఁడుబలులు.

[అని కత్తి యెత్తును. అది క్రిందఁ బడును. ఆహ్లాదనుఁడు దాని నెత్తి తండ్రిచేత నిడును. బాణుఁడు దానిం గైకొని కోపజడుఁడై యఁటుఁచు నూఁగుచు నుండును.

కుంభా.—[ప్రవేశించి] దేవా, సన్నాహ మైనది. ఆయుధాగారము గుండ తరల వచ్చును. [అందఱు తరలుదురు.

[నేపథ్యమున. ఉత్పాతవర్ణన. అందఱు ఆశ్చర్యమున వినుదురు.

రాజధాని నాలుగు బ్రద్దలుగా చీలినది! రక్తము వర్షించుచున్నది! కొండలు విలుప్తగా పగులుచున్నవి. గండశిలలు కురియుచున్నవి? వింతమెఱపులు చదలంట పొడతెంచి కన్నులం బగుల్చుచున్నవి! తుపానులోని యోడవలె భూమి యిటు నటు నొఱగి అల్లల్లాడుచున్నది! కన్నులతో కత్తులు జ్వలించుచున్నవి! ఎటు చూచినను మొండెము లగపడుచున్నవి! హా! ఇట్టి యుత్పాతములు ఎన్నఁడును వినము కనము! నేఁడు అసురకుల క్షయము!

బాణు.—ఆ నిర్భాగ్యుఁడు గంభీరవేది యిందులకా బ్రతికి యున్నాఁడు! మంచిది! గుండెగలవారెల్ల నాతోఁ రావచ్చును, ప్రాణము తీపైనవారు పోవచ్చును! [అని 'ధూళీపాళీకరింతుక్' ఇత్యాది పఠించి, వామబాహుస్పందనము సూచించి, ఆత్మగతము,] ఏమి యీబాహువులును ఆపాపాత్ముని గంభీరవేదినే అనుసరించు చున్నవి! ఏమేని గానిమ్ము.

---

వామబాహుస్పందనము=ఎడమభుజము అదరుట-అపజయ సూచకము.

(వనమయూరము)

ఇల్లిదిగొ గొల్లవటు నిప్పుడె వధింతున్.
మల్లునికి నాకుఁ బ్రతిమల్లుఁ డిసి వీఁడా ?
బిల్లుఁ డహా! ధూర్తుఁ డయి వేడబము సేయన్
గల్లవరముం బుడికెఁ గావలయు నాకున్. ౯౭

ఇదేమి! నేలకు మింటికి నొక్కఁడే పురుషుఁడు నాలుగు బాహువులు దక్క కడమ లెక్కలేని బాహువులు ఖండితములై స్కంధపరంపరనుండి నెత్తురు ధారలు దుముక నగపడుచున్నాఁడు! [విమర్శించి] ఏమైన యగుఁగాక. ఈ వటువు నుంపను.

['ఇల్లిదిగొ' ఇత్యాది పఠించుచు వీరావేశంబున నిష్క్రమించును. ఇతరులు మొగమొగంబులు చూచుకొని సాటోపంబుగ నిష్క్రమింతురు.

షష్ఠాంకము ముగిసినది.

---

౯౭ ప.—వటున్=బాలుని. మల్లునకున్=జెట్టికి. ఇసి= ఛీ. భిల్లుఁడు=కిరాతుఁడు. (కిరాతరూపముం జెందినశివుఁడు.) ధూర్తుఁడు=వంచకుఁడు. వేడబము = మాయ. పుడికెన్ = ఇచ్చెను.—కల్లవర మెట్లనఁగా బాణునిమీఁదికి వీరుని పంపక గొల్లనిఁ బంపుటచేత.

# శుద్ధవిష్కంభము.

---

స్థలకము:—శోణపురి, ఆకాశము.

చిత్రరేఖ ప్రవేశించును.

చిత్ర.—ఉష నావలన బాణమాధవసమరసంరంభంబు విని 'పతిపక్షము గెలిచిన తండ్రి కిడుమ, తండ్రిపక్షము గెలిచిన పతి కిడుము' అని తలగుండు వడిన విధమునకు ఇప్పటికిని నాగుండియ జల్లుమనుచున్నది! సమరస్యావసాన మెఱుంగుటకై దానిచిత్తము తామరాకుమీఁదినీటిబొట్టువలె తత్తరిల్లుచున్నది. [నిర్వర్ణించి] హా! యుద్ధమన నిట్టిదా! బాపురే! బాణమహారాజుతో ద్వంద్వయుద్ధక్రీడ సల్పుచునే ఈద్వారావతీవల్లభుఁడు ఎంతలో సప్తసాగరములకుం బయిగా అష్టమము నీరుధిరసాగరమును సృజించినాఁడు! ఇఁక నీ ద్వంద్వసమరము నిష్ప్రత్యూహకరంబుగ వర్ధిల్లం గావలయును. అహాహా! ఏమి యిది! బాణమహారాజు ఉద్వృత్తగ కత్తిసాముచే మెఱపులమేర వైనాఁడు! హా! ఇంక నేమి గనవలయు! నల్లగల్వతూండ్లకట్టనుంబోలె నీలశ్రీకళత్రుఁడు నందకంబున మహారాజబాహుదండభారంబు నొత్తివైచినాఁడు! హా! మహారాజు నెత్తుటిగొట్టములకేళాకూళియై ధరణి కొఱగినాఁడు! అయ్యో! ఈ వృత్తాంతమును ఉష కెట్లు చెప్పుదును? పోయి కోమలహృదయకు ప్రాణసందేహంబు గాకుండం జెప్పెద. [అని నిష్క్రమించును.

శుద్ధవిష్కంభము ముగిసినది.

---

సమర=యుద్ధ. ఇడుము=కీడు. రుధిర=నెత్తుటి. నందకంబు = శ్రీకృష్ణుల వారి కత్తిపేరు. కేళాకూళి=జలయంత్రము (హౌత్ఖానా.)

# సప్తమాంకము.

---

స్థలకము:—శోణపురి. బాణసభామంటపము.

రుక్మిణీకృష్ణులు బాణాహ్లాదన కుంభాండ
గంభీరవేదులును, రాణియు,
యథావిధవము పరివారంబును, ప్రవేశింతురు.

బాణు.—[శ్రీకృష్ణు నుద్దేశించి] పరమపురుషా, వేయిబాహువులకును నాలుగు శేషించినవి. ఒడలెల్ల దుస్సహ వేదనలు పొడుచుచున్నవి. కావు కావు మార్తశరణ్యా. [అని మూర్ఛిల్లి వ్రాలును.

రాణి.—పతిభిక్షము పతిభిక్షము పతిభిక్ష మిడుము త్రిలోకజననీ.
[అని యొడి యొగ్గి రుక్మిణిపాదములకడం ద్రెళ్లును.

ఆహ్లా.—ప్రహ్లాదరక్షకా, మానాయనం గావుము.
[అని శ్రీకృష్ణునిపాదములకడం ద్రెళ్లును.

రుక్మిణి.—శరణార్థుల ననుకంపనీయులం గావవేమి యార్యపుత్త్రా?

శ్రీకృష్ణుండు.—లే లెమ్ము, వీరావతంసా, బాణదానవా.
[బాణుండు నిద్రోత్థితుండువోలె లేచి కేల్మోడ్చి శ్రీకృష్ణుని జూచును రాణియు ఆహ్లాదనుండును లేచి కేల్మోడ్చి నిలుతురు.

శ్రీకృష్ణు.—[బాణుని మెయిం దడవుచు] ఓయి వీరప్రకాండ,

(వనమయూరము.)

అచ్చితిని నీతనయ కర్థితము లెల్లన్,
మెచ్చితిని బీరమున మేటి వని నిన్నున్,
ఇచ్చితిని వజ్రతను వింపు మెయి నీకున్,
గ్రుచ్చితిని కౌఁగిటను గూర్మి మెయి నిన్నున్. ౯౯

---

అనుకంపనీయులన్ = కనికరింపఁ దగినవారిని.

బాణా, మహావీర, నీవును మావలె చతుర్భుజుండ వైతివి. నీవు సత్త్వోత్కర్ష యొసంగితిని. దివ్యజ్ఞానము పిదప నిచ్చెద.

బాణు.—బహుజన్మముల గొప్పతప మొనర్చితిని. [ఉన్నట్లుండి, ఆశ్చర్యముతో]

శా. దేవా, దేవగురూ, భవత్కరుణచే దివ్యేక్షణంబబ్బె నా;
కీవిశ్వం బఖిలంబు నీక్షణములో నీవే యటంచుం బ్రబో
ధావిర్భావము గల్గె; నాదిరహితం బైనట్టి యోతత్త్వమా,
ప్రోవ న్వచ్చితివయ్య నన్జడు; నహో పుణ్యుఁ! బహో శ్రీహరీ!

[అని రుక్మిణీకృష్ణుల పాదములం బ్రెళ్లెను.

రుక్మి.—ఓయి బాణా, లేలెమ్ము. ఆర్యపుత్త్రమిత్త్రునికి నీ కింకేమి కొఱంత! మాశిశువులం జూడ మా చిత్త ముత్తలపడుచున్నది, ఏరీ వా రిరువురు ?

బాణు.—[లేచి] జగజ్జననీ,

క. నా దుండగమున నయయో!
గాదిలి శిశు లున్నవారు కడలిపరికిణీ
పైదలి కీవల నావలఁ
బ్రాదోషిక కోకమిథున పరుషవ్రతు లై. ౧౦౧

[రుక్మిణి శ్రీకృష్ణుం జూచును. ఇతరులు సంభ్రాంతులై ద్వారములం జూతురు. శివజ్వర విష్ణుజ్వరములు ఎదురెదురుద్వారముల ప్రవేశించి ఒండొరులను జుట్టు పట్టు కొందురు. అందఱు సంభ్రాంతులై కందురు.

---

౧౦౧ ప.—అయ్యయ్యో నాదుర్మార్గముచేత ప్రియశిశువులు (ఉషానిరుద్ధులు సముద్రమే పావడగాఁగలదైన భూదేవికి రెండువైపులను (ఒకరి కొకరు అత్యంతదూరమున) చక్రవాక దంపతులు రాత్రియం దాచరించు కఠినవ్రతను కలవారై ఉన్నారు. [చక్రవాకములకు రాత్రి ఎడఁబాఫు]

శ్రీకృష్ణ.—[చేయెత్తి] ఎవరురా మీరు ?

శివ.—దేవా, నేను శివభక్తుండను శివజ్వరమను.

విష్ణు.—దేవా, నేను భగవద్భక్తుండను విష్ణుజ్వరమను.

శివ.—బాణపక్షమున నేనును,

విష్ణు.—దేవరపక్షమున నేనును,

ఇరువురు.—పోరాడి ఒకరినొకరము ముగించుకొనుచున్నారము.

శ్రీకృష్ణ.—మేలు మేలు ! మీ మీ సఖుల పైన పిమ్మట మాకై మీ కయ్యము లేలరా ?

శివ.—[విష్ణుజ్వరమును చూపుచు] వీనికి బుద్ధి లేక.

విష్ణు.—[శివజ్వరమును చూపుచు] వీనికి బుద్ధి లేక.

శ్రీకృష్ణ.—మంచిది. ఈపని చేయుండు బుద్ధి వచ్చును. ఓరీ శివజ్వరమా, నీవు సౌమ్యరూపంబున చండికాద్వీపమునుండి అనిరుద్ధుని క్షణములో తెమ్ము, ప్రత్యయార్థము అహ్లాదనుని కొనిపొమ్ము.

శివ.—దేవరయాజ్ఞ.

అహ్లా.—మహాప్రసాదము. [నిష్క్రమింతురు.

శ్రీకృష్ణ.—ఓరీ విష్ణుజ్వరమా, నీవు దివ్య స్త్రీరూపమున, భ్రాంతిద్వీపమునుండి క్షణములో ఉషను సపరివారం దోడ్కొని రమ్ము. ప్రత్యయార్థము మహారాజ్ఞిని తోడ్కొని పొమ్ము.

విష్ణు.—దేవరయాజ్ఞ.

రాణి.—అహో ! లోకగురునికరుణ ! [ఇరువురు నిష్క్రమింతురు.

బాణు.—[జనాంతికము] కుంభాండా, ఇంద్రాదులను రంభాదులను విడుదలసేసి రమ్ము.

కుంభా.—[జనాంతికము] చిత్తము. [అని పోయి మరలి వచ్చి] అట్లే చేసితిని. వచ్చుచున్నారు.

ఇంద్రాదులు ప్రవేశింతురు.

ఇంద్రుఁడు.—[దేవతలతో జనాంతికము] నాఁడు నారదముని నాటించినసీతిబీజము నేఁటికి ఫలించినది.

దేవతలు.—లేఖ్వధ, సర్వము కాలపక్వము గావలయుఁగదా!

ఇంద్రాదులు.—జయము జయము ఆపదుద్ధారకునకు. అమరులము ప్రణమిల్లుచున్నారము. [అని నమస్కరించి]

నీటను డాఁగి కొండఁదాలి నెక్కొని నేలను బొత్తె వెట్టి పె
న్గోటను జక్కఁజేసి యడుగుల్ పగ మేదియు దవ్వు దాఁటి రా
పో టొనరించి కట్టి కలుముచ్చయి దొంగిలి లేవటంచుఁ డా
టోటుగఁ గత్తిదూయు టకటా కరికిన్ సికికిన్ జొహారుపుల్.

క. దేవా; మా పగతురపై
మావై చెడి యంతిమాస్త్రమంత్రము నీవే;
నీవే మా శాంతికముల్;
నీవే మా పౌష్టికంబు, నిగమగ, కృష్ణా. ౧౦౩

శ్రీకృష్ణ.—స్వస్తి. ఇంద్రాదులారా, వీఁడు మదీయభక్తాగ్రేసరుఁడు, మీ ప్రాణసఖుఁడు.

బాణు.—
ఇంద్రా.— } మహానుగ్రహము, మహానుగ్రహము.

---

౧౦౨ ప.—దీనియర్థమును ప్రతాపరుద్రీయ నాందిలో చూడవచ్చును.

౧౦౩ ప.—శాంతికము=కీడుందొలఁగించుకర్మ. పౌష్టికము=శ్రేయము గలిగించు కర్మ. నిగమగ = వేదగోచరుఁడా.

రంభాదులు ప్రవేశింతురు.

రంభా.—జయము జయము త్రిలోకజననీజనకులకు, దేవబందీవిమో చయితలకు. అచ్చరలము మ్రొక్కుచున్నాము. [అని మ్రొక్కి]

(గేయము.)

హరికి మంగళము మా యాపద తీర్చు సిరికి మంగళ మిదే.
తాతకు జోహారు మా యమ్మను గన్న తాతకు జోహారిదే.
బావకు సలాము మా యింద్రునితోడి మఱిదికి భద్ర మిదే.
హరికి మంగళము మా యాపద తీర్చు సిరికి మంగళ మిదే ౧౦౭

శ్రీకృష్ణ.—కల్యాణము కల్యాణము.

బాణు.—శిరీషకుసుమంబుల నెండలో వయిచినందులకు లజ్జించెద.

రంభా.—బాణమహారాజా, నీవలన జగజ్జననీజనకుల కృపకుం బాత్ర మైతిమి.

ఆ. జాతిరత్న మొందు సానఁ దీర్పుటఁజేసి
రాజమకుట మెక్కరమ్యగతిని,
క్లేశకారి యైనఁ గేశాదిసంక్రియ
వలపువానిమూర్తి వఱలఁజేయు. ౧౦౮

బాణచక్రవర్తీ, నీవు మాకు గురువవు గాని పరిపంథివి గావు.

అనిరుద్ధుఁడును ఆహ్లాదనుఁడును ప్రవేశింతురు.

అని.—తాతకు అవ్వకును అనిరుద్ధుఁడను మ్రొక్కుచున్నాను.
[అని ప్రణమిల్లును.

రుక్మిణీకృష్ణ.—రా నాయనా రా.
[అని చేరఁదివిది ఒడింగూర్చుండఁబెట్టుకొని లాలింతురు.

---

౧౦౭ ప.—అమ్మను గన్న = గంగను కన్నట్టి.

[నేపథ్యములో దుందుభిధ్వానము పుష్పవృష్టియు.]

రుక్మి.—[అనిరుద్ధుని కపోలమున చేయియుంచి అతని మొగముచు తన వైపు త్రిప్పుకొనుచు] కష్టములు పడితివా నాయనా?

అని.—మిముఁ బాసినకష్టమే గాని ఇందు కష్టము లేదు.

ఆహ్ల.—అహో! ఎట్టిమహాసత్త్వుఁడు!

శ్రీకృష్ణ.—ఒరులకు పట్టువడితివేమి బాలకా?

ఆహ్ల.—జగద్గురూ, మాచెల్లెలియపరాధ మది. ఆసమయమున ఉష 'ఆర్య పుత్త్రా, మా నాయనను గావుము' అని వేఁడినది. ఆమాటకు ఈమహాసత్త్వుఁడు కట్టువడియెనే గాని మానాయనగారి నాగపాశమునకుం గట్టువడ లేదు.

శ్రీకృష్ణ.—[నవ్వుచు] సరి, సరి.

బాణు.—[అనిరుద్ధునికి మోఁకరించి] పుత్త్రభాండ, అసురవృత్తిమై గుణము గ్రహింపనొల్లనినా నేరమిని మన్నింపుము. [అని గడ్డము పట్టుకొనును.

అని.—ఎవర వోయి నీవు?

బాణు.—నీమామను బాణాసురుఁడను.

అని.-[ఆశ్చర్యపడుచు] నీ వెక్కడిబాణాసురుఁడవు? బాహుసహస్రమేది?

బాణు.—వారి నడుగుము. [అని శ్రీకృష్ణుని చూపును.

అని.—[లేచి, బాణునిచేయి పట్టుకొని] నామూలంబున మామకుం గలిగిన ప్రయాసకు మామయే నన్ను మన్నింపవలయును.

[అని వేఱొక యాసనమునం గూర్చుండును.

బాణు.—నీమూలంబునంగదా నాకు సకలాభ్యుదయములుం గలిగినవి!

ఆహ్ల.—[నిర్వర్ణించి] నాయనా, అదె ఉష వచ్చుచున్నది.

ఉ ష ం దో డ్కొ ని రా ణి యు, చి త్ర రే ఖ యు,

శి శు వ్రం గొ ని క రే ణు క యు,

ప్రవేశింతురు.

ఉష.—[చిత్రరేఖతోడ జనాంతికము] చిత్రరేఖా, సఖీ, అహో ఆర్యపుత్త్రుఁడు మరల శుభదర్శనుఁడు ఈకన్నులకే అగపడుచున్నాఁడు! ఈ

కల్యాణమున నాడెందము అనిర్వచనీయ భావ సమ్మర్ద సమాకులం బై మోహాంబుధియందు మునుంగుచున్నది. సాహసము మీఱి బాష్పఝరంబు కనుదోయి కెక్కుచు దరుల నుఱులంగొని పోవుచున్నది! [కన్నులు చేలాంచలమునం దుడిచికొని] ఈ దివ్యసాన్నిధ్యంబున ఆత్మ నెట్టులు వసమున నిలుపుకొందును!

చిత్ర.—తేఁకువ గల్గుము. సఖీ తేఁకువ గల్గుము. ఈ మంగళపారాయణంబున సమ్మోహముం గడ కొత్తుము.

ఉష.—సఖీ, నీయాజ్ఞ. ఈ లోకగురువుల యెదుర సపుత్త్రనుగా ఆర్యపుత్త్రునిఁ గలయ లజ్జించుచున్నాను. సఖీ, నాఁటి నీకల్యాణోక్తి యిపుడు స్మరణకు వచ్చుచున్నది. వీరేగదా ఆర్యపుత్త్రునికి [అనుసర్ధోక్తిలో]

చిత్ర.—[జనాంతికము] 'మాకు' అనుము.

ఉష.—[జనాంతికము] సఖీ, నీనోట నమృతము పోయవలయును. వీరేగదా మాకు అన్వయము తాతయు! అహో! అమోఘదర్శనులు. వీరిదర్శనముచే నాచిత్తమున నేమో నిర్వృతి యుదయించుచున్నది.

చిత్ర.—[జనాంతికము] వీరే నీమొఱ ఆలకించినవారు. ఈవ్యాజమున నీయుపాసనకు ఫలముగా నీకుం బ్రత్యక్షమైనారు.

రాణి.—[కరేణుక చేతినుండి శిశువుం గొని రుక్మిణిం దఱిసి] అనిరుద్ధకుమారుని గ్రహింపుఁడు. [అని రుక్మిణి కిచ్చును.

రుక్మి.—[గ్రహించి, నిర్వర్ణించి, ముద్దు లిడుచు] అహో పుణ్యము! ఆర్యపుత్త్రా, ఈబాలసూర్యోదయముం జూడఁ గోరిక కలదా?

శ్రీకృష్ణ.—[కైకొని] ఈస్వరూపము సంద్రికి వెండియుఁ కందువుఁదనము వచ్చినట్లున్నది!

[రుక్మిణి శిశువును మరలం గైకొని ముద్దులు గొనును. ఇతరులును శిశువును లాలింతురు.

బాణు.—[ఉషం జేరం జని గడ్డము పట్టుకొని] నాకూనా. [కన్ను నిర్దేశించి] ఈ క్రూరాత్మునివలన శ్రమపడితివిగదా.

---

తేఁకువ = ధైర్యము.

ఉప.—[ఆత్మగతము] అహో! నాయన దైన్యమును నే నెట్లు గందును!
[అని కన్నీళ్లు నించును.

రాణి.—[సబాష్పము] నీదౌష్ట్యమేని యభినందింప నోఁచనైతినిగదా!

ఉ. లోకములోనఁ దల్లు లతిలోలలు దేవిళులైనకూఁతు న
స్తోక ముదంబుతో నరిది సూడిదలన్ విభవోత్తరోత్సవా
నీకములన్ విభూషలను నిత్యము నోముదు; రట్టి తల్లి నై
యాఁకొని నాత్మ నీ కిడినయోఁకర లింపులు నాస్తులే గదా. ౧౦౬

ఉప.—[సబాష్పము] నాయనకుం గ్లేశ మిడిన నేను గదా యపరాధను, నా కష్టము నాయన మన్నింపవలయును. [అని బాణునిపాదముల వ్రాలును.

బాణు.—లే అమ్మా లే. [అని లేపి] నీకు సర్వశ్రేయములును త్రైలోక్యమాతాపితలు వారొసంగుదురు. నా పెట్టిన క్లేశములు మఱతువా అమ్మా?
[అని బాష్పములు విడుచును.

ఉప.—[స్వగతము] ఈలోకగురువుల ప్రోల నాయనకు ఏమి బదులు పలుకఁగలదు! [ప్రకాశము] నాయనా, ఎఱుఁగనిదాని నెట్లు మఱతును!

బాణు.—పట్టీ, నీకుమనే ఋజ్జితుఁడను. [అని బాష్పాకులుఁడగును.

శ్రీకృష్ణ.—రావోయి బాణా, రా; నీదౌహిత్రుని గనుము.
[అని శిశువును ఇచ్చును.

బాణు.—[శౌరి కని] అహో!

తే. అమృతమున నూరినట్టి కల్పకపుఫలము!
వెలఁది చక్కెర వెన్నెల వింతబొమ్మ!
ఈబుడుతగాని నింక నే నీయఁజాల!
వీనియెలనవ్వదెంత నిర్వృతి కరంబు! ౧౦౭

---

౧౦౬ ప.—అతిలోలలు = అత్యంతప్రేమ కలవారు.

౧౦౭ ప.—కల్పకపుఫలము = కల్పవృక్షముయొక్క పండు. వెలఁది = ధావళ్యముగల. ఎలనవ్వు = లేఁతనవ్వు. నిర్వృతి = ఆనంద.

[అని ముద్దిడి] ఏమి మొగము చిట్లించెదవు! మీసలు గ్రుచ్చెనవా? లేక నీవును ఆలోచన వాఁడవా?

రాణి.—అమృతపు బుగ్గా, నిన్ను, మందభాగ్యురాలను లాలింప నోఁచనైతిని. [అని చెక్కిళ్లు పుణికి తనకపోలమున మెటికలు విఱుచును.

బాణు.—[శిశువును ఉషచేతి కిచ్చి, ఉషను కేలఁ గొని] అనిరుద్ధ మహారాజా, నాదుండగమునకు దండువుగా ఇదె నీకు ఉష నిచ్చుచున్నాను.

(ధ్రువకోకిల)

దళిత శత్రుఁడ, నీకునై యుష తా సహించిన బన్నముల్
కులగిరుల్ గలయంతకాలము ఘూర్ణిలున్ ధరణీస్థలిన్;
గలఁగకో యదువీర, నాపయిఁ; గన్నె నర్మిలి నేలుమా!
తలఁపకయ్య యుషన్ స్వయంవృతదత్త నొప్పరికింపఁగాన్. ౧౦౮

అని.—పెద్దల చిత్తమును తప్పు చేసికొనను.

శ్రీకృష్ణు.—ఆశిశువు కొసరటోయి బాణా? సాలంకార కన్యాదాన మెఱుంగుదుముగాని సపుత్త్రకన్యాదానము చేసినవారిని కొన్నవారిని ఎఱుంగము.

[ఉషాచిత్రలు సాకూతముగా నొండొరులం గందురు.
ఉష సలజ్జముగా నధోముఖిగా నుండును.

రుక్మి.—ఉషా, శిశువును నీయార్యపుత్త్రునిచేతి కిమ్ము.

[ఉష ఇచ్చును, అనిరుద్ధుఁడు గ్రహించును. నేపథ్యమున దుందుభిధ్వానము పుష్పవృష్టియు. ఉష చిత్రలేఖను సాకూతముగాఁ గాంచును. చిత్రలేఖ సాకూతముగా మందహాస మొనర్చును. అనిరుద్ధుఁడు శిశువును నిర్వర్ణించి రుక్మిణిచేత కిచ్చును.

---

౧౦౮ ప.—బన్నముల్=పాట్లు. కలఁగకు=కోపము చేయకుము. అర్మిలిన్=ప్రేమతో. స్వయంవృతదత్తన్=స్వయముగా నీచేవరింపఁబడి తానుగా తన్నునీకిచ్చుకొన్నదానిని.

రుక్మి.—[ఉషం జేరం బిలిచి] మహాసాధ్వీ, ఉషా, నీకు తఱుగని సౌభాగ్య మిదె యొసంగితిని.

ఉష.—[కేల్మోడ్చి] మహాప్రసాదము. [స్వగతము] నాచెలి వలనం తయుఁ దీఱినంగదా నేను ధన్యురాలను.

రుక్మి.—[ఆత్మగతము] ఆహా! దీనిహృదయ మెంత మైత్రీకోమలము! [ప్రకాశము] ఆర్యపుత్త్రా. వీరి కిరువురకు కామ సహాయ, ఉషకు అస్మ దుపాస నోపదేశ గురువు, నారదశిష్య మహాయోగిని, గుణఖని ఈ చిత్రరేఖ. దీని యీప్సితమును ఈ యుషాభ్యుదయముతోఁ గూర్పుఁడు.

రాణి, బాణుం.—ఆహా! ఈపుణ్యాత్మురాలు, ఉషకును మాకును ఇంత యభ్యుదయము కావించినది. [రాణి చిత్రం దఱియఁ దివిచి బుజ్జగించును.

శ్రీకృష్ణ.—ఇయ్యవోయి కుంభాండా, నీతనయను అస్మత్ప్రహ్లాద దేశ్యునికి ఆహ్లాదనునికి.

ఉష.—[స్వగతము] ఆహా! ఏమి నా పుణ్యము! మాయన్నకే చిత్ర యాభరణ మైనది!

కుంభా.—మహాప్రసాదము. [అని చిత్రరేఖ నొడి నిడుకొని]

ఉ. నాదగుకోర్కెచే భువననాథునియానతిచేత నిత్తు నా
గాదిలియాత్మజన్ గగనగామిని యోగినిఁ జిత్రరేఖ నీ;
కోదనుజేంద్రనందన, దయోచితవైఖరి నేలు కూర్మిలోఁ
బేదవు గాకుమన్న ; నినుఁ బెన్నిధిఁ గోరిన దన్న భర్తగాన్.

[అని యాహ్లాదనుని కిచ్చును.

ఆహ్లా—పెన్నిధి ప్రథమగదా. మహాప్రసాదము.

---

౧౦౯ ప.—భువననాథుని = జగన్నాథుఁడయిన శ్రీకృష్ణునియొక్క. దనుజేంద్రనందన = అసురరాజకుమారుఁడా. పెన్నిధిన్ = పెద్దనిధానమును.

పెన్నిధి ప్రథమగదా—పెన్నిధి ప్రథమావిభక్తి యయిన 'నాకు పెద్ద నిధానమయిన చిత్రరేఖయే నన్ను కోరినది' అని భావ మగును.

బాణు.—ఓహో శ్రోత్రవ్యాకరణాధ్యయనము ! [అందఱు నవ్వుదురు.

ఆహ్ల.—పెద్దలయాజ్ఞ చేతను నిజేచ్ఛ చేతను గ్రహించుచున్నాను.

[నేపథ్యమున దుందుభిధ్వానాదికము.

రుక్మి.—చిత్రరేఖా, నీకు తఱుగని సౌభాగ్య మొసంగితిని.

చిత్ర.—[కేల్మోడ్చి] మహాప్రసాదము.

రాణి.—[చిత్రరేఖం జేరం గొని] రూపెత్తిన మాభాగ్యమా రావమ్మా; రారమ్మ యువరాజపట్టమహిషీ.

[కరేణుకా గంభీరవేదు లొండొరులం గని గుటకలు మ్రింగుచుందురు.

శ్రీకృష్ణ.—వీ రెవరు ? వీరికిని అన్యోన్యదాంపత్యాభిలాషవలెనున్నది.

బాణు.—మహానుభావా, వీఁడు నా బంధువు, వీనికై శిశువుల కీ యిడుమలు. ఇది యుషాధాత్రేయి. ఇది వీనికి తగినదాంపత్యము.

రంభ.—[ఊర్వశితో జనాంతికము] అది కోఁతికి వెన్నెలభోనము.

శ్రీకృష్ణ.—వీరికిని దాంపత్య మగునుగాక. మాలలు మార్చుకొండి.

[కరేణుకా గంభీరులు సంతుష్టితో అగ్న్యాదుల సాహాయ్యంబున మాలలు మార్చుకొందురు. నేపథ్యమున దుందుభిధ్వానాదికము.

ఊర్వ.—[రంభతో జనాంతికము] సఖీ, రంభా, ఆరెంటికిని ఇది దృష్టి పరిహారమునకు.

శ్రీకృష్ణ.—మీకు నమస్కృతికి సెలవు. కాని మీరు దండెములు తీయలేరు. అందఱకును ఒక్క మాటే దొరలుఁడు.

[అందఱు నవ్వుదురు. ఆయిదుగురు నట్లే దొరలుదురు. గంభీరవేదియుఁ కరేణుకయుఁ యత్నించియు లేవలేరు.

రంభ.—[జనాంతికము] ఊర్వశీ, ఈ నాట్యమును నీ వెక్కడ నేని నేర్చితివా?

ఊర్వ.—ఇప్పుడు నేర్చుకొందము.

శ్రీకృష్ణ.—వీరిదాంపత్యము మిగుల శోభిల్లుచున్నది.

[బాణాహ్లాదనేంద్రాదులు గంభీరవేదిని లేపుదురు. అతఁడు లేచును. రాజ్ఞీరంభాదులు కరేణుకను లేప యత్నింతురు. అది లేవదు. గంభీరవేది లేపును.

శ్రీకృష్ణ.—ఇంద్రాదులారా, మీరెల్ల కడు నలంగితిరి. నిజాస్పదంబులు సేరి సుఖముండుఁడు.

ఇంద్రా.—మహానుగ్రహము. [అని రుక్మిణీకృష్ణులకు భక్తినమ్రులై, బాణాహ్లాదనులతో] మిత్రములారా, పోయి వచ్చెదము.

[బాణాహ్లాదనులు వారిం గవుంగిలింతురు. ఇంద్రాదులు నిష్క్రమింతురు.

గంభీ, కరే.—[ఒండొరులతో, జనాంతికము] వీళ్లకి పొర్లి పొర్లి దండాలు పెట్టి మనంమాత్రం నలగలేదా ?

రంభా.—అంజలి చేసెదము. [అని రుక్మిణీహరులకు సాంజలులై, బాణాహ్లాదనులతో] పోయివచ్చెదము.

బాణాహ్లాద.—మంచిది. [రంభాదులు నిష్క్రమింతురు.

శ్రీకృష్ణ.—ఓయి బాణా, శిశువులకు వియోగభారము లేకుండ మీరెల్ల వీని బారసాలకు ద్వారకకు మాతో నిపుడే తరలుఁడు.

[కీ యనుచు గరుడుఁడు ప్రవేశించి వారిని ప్రదక్షించి ఒక్కెడం గూర్చుండును.

శ్రీకృష్ణ.—మేమెల్ల చిత్రాహ్లాదనుల యథావిధి వివాహమునకు మరల నిటకు వచ్చెదము.

బాణ.—
రాణి.—
ఆహ్లా.—
కుంభా.—
} మహాప్రసాదము, మహాప్రసాదము.

శ్రీకృష్ణ.—కుమారా, అనిరుద్ధా, జయాభ్యుదయములో నీకు ఇంక నేమనోరథముం దీర్తును ?

అని.—లోకనాయకా,

ఉ. కూరిమిబంధు లై రసురకుంజరు, లంబుధివేష్టి తోర్వరా
సార రసాయ నౌషధిగ సన్నుతి గన్నది పత్ని యయ్యె, నిం
డారె ముదంబు చిత్రయు సమంచితశీలునిఁ జెట్టఁ బట్టుటన్,
గోరిక లింక నేమి గలుగున్ గరుణాభరణాత్మ, చెప్పుమా.

అయిన నిది యగుఁగాక.

(మంగళమహాశ్రీ)

శ్రీసుదతికాంతుకళఁ జెందినఘనుల్ జనుల
నేమమున నే నేయుదురు గాతన్,
వాసవుఁడు గాలమున వర్షిలుతఁ, బాఁడియును
బంటలును నవారి యగుఁగాతన్,
వాసిమెయిఁ బైదలులు భర్తృహితవృత్త లయి
భాగ్యములఁ దేలుదురు గాతన్,
భాసుర మనీషి కవి వాగమృత వాహినుల
వర్తిలుత మంగళమహాశ్రీ ౧౧౧

ఉషానాటకము సమాప్తము.

---

౧౧౦ ప.—దానవేంద్రులు ప్రియబంధువు లయినారు. సముద్రపరీత సర్వభూమండలములోను శ్రేష్ఠ మైన దివ్యౌషధి యని ప్రసిద్ధిచెందిన యుష నాకు భార్యయైనది. మాచెలి యయిన చిత్రరేఖయు మంచిమగనిం బడయుంటచేత మాహృదయములకు ఆహ్లాద మయినది. కరుణాలంకృత హృదయుండా ఓదేవా, ఇంకను కోరిక లే మందును.

౧౧౧ ప—శ్రీ...నుల్=లక్ష్మీనాథునియొక్క కళను పొందిన గొప్పవారు - అనఁగా రాజులు. వాసవుఁడు=ఇంద్రుఁడు. పైఁదలులు=స్త్రీలు. భాసుర...శ్రీ=ప్రసిద్ధ విద్వాంసు లయిన కవులయొక్క వాక్కు లనెడి యమృత నదులయందు శుభ మయిన మహాశ్రీ వసించుఁ గావుత.

